Photo by D. S. Kasbekar



బహుమతి
పొందిన వ్యాఖ్య

మాకు తోడు...

పంపినవారు :
డి. జి. క్రిష్ణమూర్తి - సికింద్రాబాదు

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక:
చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ,
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.






రిజిస్టర్డు నం: 119923

## డైమండ్ సుగంధవక్క పొడి

### ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధిచెందినదిన్నీ. మీరు ఈసారి వక్కపొడి కొనేటప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

## ది డి. పి. అండ్ కంపెని,

## కౌల్‌బజార్ - బళ్ళారి - 1.

: సేల్సు డిపోలు :

చీరాల - గుంటూరు - కర్నూలు - ఆదోని - హుబ్లి.


నేడే చూడండి!
ప్రభా ప్రొడక్షన్స్ వారి......
ఆడపెత్తనం
దర్శకుడు: ఆదుర్తి సుబ్బా రావు.
సంగీతం: యస్.రాజేశ్వరరావు అండ్ యం. వేణు.
నిర్మాతలు:
వై. నారాయణస్వామి. M.A.LL.B. & యం.వెంకట్రామదాసు.
FLOODLIGHT



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

షేక్స్పియర్ మహాకవి రచించిన నాటకాలు ప్రపంచమంతటా ఖ్యాతి తెచ్చుకొన్నవి. వాటిలో కొన్నిటిని "చందమామ"లో అప్పుడప్పుడూ కథల రూపంలో ప్రచురించ నిశ్చయించాము. వాటిలో మొదటిది "అరణ్యవాసం" అనే కథ.

ఈ కథలో మంచి నీతికూడా ఉన్నది. అధికారవ్యామోహం గల వాళ్లు తమ గొప్పతనం సింహాసనాలలోనే ఉన్నదనుకుంటారు. అధికార బలమే నిజమైన బలమనుకుంటారు. తమ గొప్పతనం నిలబెట్టుకోవటానికి అమానుషమైన పనులు చేస్తారు.

అయితే మనిషియొక్క నిజమైన బలం శీలం పైనా, సౌజన్యం పైనా, అదరాభిమానాలపైనా ఆధారపడి ఉంటుంది. అధికారులు దుష్టులైనప్పుడు ఈ సద్గుణాలు నగరాలలో రాణించలేక అడవులపాలై పోతాయి. వారి అత్యంత ఆప్తులు సయితం వారిని విడిచిపెట్టిపోతారు. అలాటి సమయంలో సంఘమూ, సంస్కృతీ అడవిలోనే నివాసం ఏర్పరచుకుంటాయి గాని సింహాసనాలనూ, అధికారాన్నీ అంటిపెట్టుకుని ఉండవు.

ఈ విషయాన్ని "అరణ్యవాసం" స్పష్టంచేస్తున్నది.

సంపుటి 23 ★ సెప్టెంబరు 1958 ★ సంచిక 3

## అట్టి విూ ది బొ మ్మ

సంజయుడు హస్తినాపురానికి బయలుదేరి వెళ్లిపోగానే ధర్మరాజు కృష్ణుడితో, "దేవా, ఇప్పుడు మాకు కర్తవ్య మేమిటో నీవే చెప్పాలి. రాజ్యం ఇవ్వకుండానే యుద్ధం మానమని సంజయుడు అడిగాడు. నేను కేవలం అయిదు ఊళ్లే అడిగాను. యుద్ధం చేసి రక్తపాతం చెయ్యటం నాకిష్టం లేదు," అన్నాడు.

దానికి కృష్ణుడు, "ధర్మరాజా, భిక్ష కోరటం క్షత్రియ ధర్మం కాదు. నేను వారివద్దకు రాయబారం వెళ్లి మంచిగా మీ రాజ్యభాగం ఇమ్మని అడుగుతాను. కాని అందువల్ల ప్రయోజనం ఉండదని నా అనుమానం. మంచి మాటలతో పని జరగకపోతే యుద్ధంలో మీకు కలగబోయే విజయాన్నీ, మీ ధర్మాన్నీ వివరించి, దుర్యోధనుడి పక్షాన పోరవచ్చినవారి మనసులు మారుస్తాను," అన్నాడు.

అప్పుడు భీముడు, "కృష్ణా, యుద్ధం మాటలతో దుర్యోధనుణ్ణి బెదరగొట్టకు. వీలయినంతవరకు మంచిగా పని జరిగేటట్టు చూడు!" అన్నాడు. భీముడి సౌమ్యం చూసి కృష్ణుడు నిర్ఘాంతపోయాడు. భీముణ్ణి రెచ్చగొట్టటానికాయన సూటీ పోటి మాటలన్నాడు. "నేను భయపడి సంధి కోరుతున్నాననుకుంటున్నావా? యుద్ధంలో ఆ కౌరవాధముల నందరినీ చీల్చి చెండాడేస్తాను. నా బలపరాక్రమాలు నీవే చూస్తావు!" అని ఆర్భాటం చేశాడు భీముడు.

తరవాత అర్జునుడుకూడా తాను ధర్మరాజుతో ఏకీభవిస్తున్నాననీ, సంధి సాధ్యంకాని పక్షంలో కృష్ణుడు తన యిచ్ఛానుసారం మాట్లాడాలనీ అన్నాడు. నకులుడుకూడా సౌమ్యంగానే మాట్లాడాడు.

కాని సహదేవుడు మాత్రం, "నాకు ధర్మంతో పనిలేదు. కౌరవులు శాంతినే కోరినా మేము యుద్ధంచేసి వారిని నాశనంచేస్తామని చెప్పు!" అన్నాడు. సాత్యకి సహదేవుణ్ణి బలపరిచాడు. పాండవుల పక్షాన పోరవచ్చిన రాజులందరూ యుద్ధోద్రేకంతోనే మాట్లాడారు.

ఆఖరుకు ద్రౌపది తన జుట్టును కుడిచేత పట్టుకుని కంట నీరుకార్చుతూ కృష్ణుడి వద్దకు వచ్చి తాను పడిన కష్టాలన్నీ చెప్పుకుని, "నాకు అంత అవమానం చేసిన ఆ దుర్మార్గులింకా బతికేఉన్నారు. వారు చచ్చేలాగు చూడు!" అని ఏడ్చింది. "అమ్మా, ఏడవకు. నీ యేడుపుకు వేయింతలు వారి స్త్రీలు ఏడవటం నీవే చూస్తావు! నా మాట నమ్ము!" అని కృష్ణుడామెను ఓదార్చాడు.



# కాకోలూకీయం

గూబరాజు :

ఓ మంత్రి రక్తాక్ష - నీమాట యేమి
ఈ పూడ్కి పరమంత్రి - నేమి సేయుదము?

రక్తాక్షుడనే మంత్రి :

యోచింప నేటి కా-లోచింపనేల.?
ఈ చెడు పరమంత్రి - నిటె చంపవలయు
దొరికిన శత్రుని - దునుమాడవలయు
తరుణమ్ము వచ్చునా - తర్వాత మనకు?
వినిపింతు నొక కథ - వివరింతు దీని
మును హరిదత్తు డం-చును విప్రుడుండె.
ఎంత సేద్యము చేయ - నేమి లాభమ్ము?
కొంతైన లాభమ్ము - కూడిరాలేదు.
ఎండప్రొద్దున అత - డెంతయో దున్ని
కొండొక చెట్టు క్రిం-దం డస్సియుండ
ప్రక్కన పుట్టలో - పామొక్కటున్న
దిక్కుగా చూచి ఆ - దీన విప్రుండు
ఈ చేను కాపాడు - నీ పాము నిజము
నాచేత పూజ యే-నా డందలేదు.
అందుకే నా పంట - అటు పోవుచుండె
ఇం దింక పూజల - నందింతు నంచు
పాలు మూకటిలోన - బ్రాహ్మడు పోసి
కాలనాగము పుట్ట - కడ ఉంచి వెళ్ళె.
మరునాడు తావచ్చు - సరికి మూకటిని
బరువైన దీనార - మరుదుగా చూచె.
అది మొదల్ రోజు పా - లట ఉంచి వెళ్ళు,
అది మొదల్ దీనార - మట గానిపించు.
ఊరి కేగుచు విప్రు - డొకనాడు, కొడుకు
జీరి పుట్టకు పాలు - చేర్పుమన్నాడు.
కొడు కట్లు సేసి అ-క్కడ కూడ చూచి
కడు మాడ లీ పుట్ట - గల వనుకొంచు
గడ్డపాఱను త్రవ్వి - గడబిడ సేసి
అడ్డుగా పాము రా - నటు మోదినాడు
పాము కోపమ్మున - పట్టుక కఱచె
ఆ మానవుడు చచ్చె - నా విషమ్మెక్కి
మరునాడు విప్రుడు - తిరిగి ఏతెంచి
జరిగిన కథ విని - దురపిల్లి, పాలు

విద్వాన్ విశ్వం



కొనివచ్చి పామును - కొనుమన్న వినక
చనుమని ఒక మణి - సర్పమ్ము నిచ్చె.
ఇక రాకు మీదారి - ఇది చాలు ననియె
అకట వచ్చినయట్టి - అవకాశ మీగె.
కనుక ఈ కాకి మం-త్రిని చంపుటొకటె
మన కిపుడే మేలు - మరి వీలుపడదు.

అరిమర్దనుడు - (గూబరాజు)

వింటిరా రక్తాక్షు - డంటున్న దెల్ల
కంటిరా చెప్పుడు - కర్తవ్య మేమి?

క్రూరాక్షుడు - (2వ-మంత్రి)

వినరాదు రక్తాక్షు - విరసంపు పలుకు
చనునె చంపించుట - శరణాగతులను.
ఆత్మార్పణమ్మైన - అతిథికై సేసి



ఆత్మము క్తిని గంట - అధిక ఫలమ్ము
వినుడొక కథ చెప్పి - వివరింతు దీని
మునుపు బోయ యొకండు - వని దిరుగాడు
వల చేతగొని వన-మ్ముల దిరుగాడు
బలిగొను ఒక పిట్ట - కనిపించి నంత.
పావుర మ్మొకదాని - పట్టుక వాడు
పోవుచునుండ గా-లీ వాన వచ్చె.
వడవడ వడకుచు - వటమును జేరి
తడిసి ముద్దై ఏడ్చు - తట్టుకో లేక.
ఆ చెట్టుపై నున్న - దా పావురమ్ము
కాచుకున్నది జత - కానంగ రాక.
వాని బుట్టను గల - పావురమ్మంత
దానితో ననె, "వలజ - తగులుకున్నాను.
కాని ఈ బోయ నీ-కడ కేగుదెంచె
వాని కాతిథ్య మి-వ్వగవలె నీవు"
ఆ మాట కా చెట్టు-నందున్న పక్షి
ఈ మాడ్కి తన జత - నిటు పట్టె ననక
బోయకై నిప్పు న-ప్పుడు దూరమేగి
పాయక కొనివచ్చి - పడవేసె నచట
పుల్లలు రగిలె ఆ - బోయయు తనిసె
అల్లన నా పక్షి - అగ్నిలో దూకె.
తనకయి యిటు దుఃఖ-మును గణింపకయె
తన జంట పట్టెనన్-తప్పు చూడకయె
తన దేహమునె త్యజిం-చిన, వాడు చూచి





తన రీతి మార్చుక - తపియించి లేచి
తా బట్టుకొన్న ఆ - తరుణ కపోతి
గూబలు ముద్దాడి - గొబ్బున విడిచె.
తన వృత్తి మానివే-సెను, కాయ కసురు
తనకు చాలనుకొనె - తగవరి బోయ
కావున శరణన్న - కాదు చంపంగ
ధీవర అని పల్కె - నా వరమంత్రి.

అరిమర్దనుడు :

వింటె క్రూరాక్షుని - విశద వాక్యముల
దంటవు నీవింక - తగవాడు మయ్యా.

దీప్తాక్షుడనే మంత్రి :

దండింప పాడి గా-దని నే దలంతు
ఉండు నేనొక కథ - నొక్కంత వింతు.
వెనక నుండెను నొక - వృద్ధ వైశ్యుండు
తన కున్న ధనమిచ్చి - తమకమ్ముతోడ,
ఒక కన్నె పెండ్లాడి - సుకమింత లేక
బికబిక లాడుచు - వెత నెందుచుండె.
ముసలివా డితడని - మూతి ముడుచుకొని
కసురుచు నుండు నా - కన్య యే ప్రొద్దు.
చెలి, వాడు పెడ మొగ-మ్ముల నొక రాత్రి
పలుకక శయనింప - వచ్చెను దొంగ.
సద్దైన దొంగ నా - సతి చూచి బెదరి
అద్దరి గల భర్త - నటు కౌగిలించి
గట్టిగా పట్టుక - కదలకున్నంత




సెట్టి ఆనందించి - చెలి కౌగిలించె.
ఎన్నడు లేనిదీ - కన్నెయు దాకె.
నన్నేలనని సెట్టి - నలుగడల్ చూచె.
కనపడె దొంగ అ-క్కడ మూల నక్కి
వినపడగా సెట్టి - విశదీకరించె.
"కలనైన ఈ పిల్ల - కౌగిట రాదు
కలిగె నీనా డీమె - కౌగిలి నాకు
ఇట్టి సంతుష్టి క-ల్పించితి వీవు
పట్టుకపొమ్మోయి - పెట్టెయు జేడ"
ఆ మాటకా దొంగ, - "అక్కఱ లేదు
నీమాట చా" లంచు - నేగె బిరాన.
వీడును మనకేదొ - వినియోగపడును
పాడి గాదిది వీని - పరిమార్చు టెపుడు





అరిమర్దనుడు :

సరి కాని వక్ర నా-సా వింటి వన్ని
ఎరిగింపు నీ భావ - మేర్పడ నాకు.

వక్రనాసుడనే మంత్రి :

వధియింపరాదు; ఏ - పగిదిని చూడ
విధము చూడగవలె - వినియోగమునకు
వైరు లిద్దఱు పోర - వచ్చు లాభమ్ము
ఏరీతినో చెప్పు - దిక విను రాజ!
ఒక ఊర ఒక బ్రాహ్మ - డుండెను మున్ను
సకలమ్ము విడియున్న - సజ్జను డతడు.
ఆ విరాగికి రెండు - ఆవుదూడలను
దైవమే ఇప్పించె - ఏ విధినైన.
లే చివుళ్లను మేపి - లేగడ్డి మేపి
లేచిన దాదిగా - లేగల బెంచె.



లెస్సగా మేసి బ-లే కండ పట్టి
బుస్సుమంచవి పొంగి - పొంగించె వాని.
సత్తువతో నున్న - జత యెడ్ల జూచి
కత్తిరింపగ నెంచె - కామించి యొకడు.
ఆ దొంగ బాపన-య్య కుటీరమునకు
పోదలంచెను రాత్రి - ప్రొద్దు పోగానె.
వానికి దారి గన్న-డె రాక్షసొకటి
తాను బాపని మింగ - తరలితి ననియె.
ఇరువు రా బాపని - యింటికే చనిరి
మఱి అపుడే వచ్చె - మాటపై మాట.
తొలుత యెద్దుల గొందు - తొలగనె దొంగ
తొలుత బాపని తెందు - తొలగనె అసుర.
అందుపై ఘర్షణ - అధికమ్ము కాగ
కొందలపడి లేచి - కొసకు విప్రుండు.
ఇదిగొ ఈ రాక్షసి - హింసించు నిన్ను
పదిలమ్ముగా తిను - పదమనె దొంగ.
వీడు నీ యెద్దుల-జోడుకై వచ్చె
చూడ మంచనె రాక్ష-సుడుకూడ నంత.
విప్రుడంతట మంత్ర-విధి పిశాచమ్ము
ప్రప్రథమమ్మున - పారద్రోలుచును
బడితతో దొంగను - పరువెత్త జేసె
కడకు వారిద్దరు - కడకేగ వలసె.
కావున ఈ మంత్రి, - కాకరాజునకు
నే విధి పగయైన - నిది మేలుకాదె.





# బ్రహ్మప్రళయం

బ్రహ్మదేవుడు భూమిపై మానవులను సృష్టించి, "నాయనలారా, తిరిగి నేను ప్రళయం కలిగించేదాకా మీరు ఈ భూమిపై జీవించండి!" అని వరం ఇచ్చాడు.

"దేవా, తిరిగి ప్రళయం ఎప్పుడు వస్తుందో మాకు తెలిసినట్టయితే మేము భూమిపై చేయదగిన కార్యాలను నిర్ణయించుకుంటాము!" అన్నారు మానవులు.

"ప్రళయం ఎంతకాలానికి జరిగేదీ మీకు తెలియగలందులకు నేనొక ఏర్పాటు చేస్తాను," అంటూ బ్రహ్మదేవుడు ఒకచోట మూడు కర్రలు పాతాడు. మొదటి కర్రకు 64 వలయాలు అమర్చాడు. అవన్నీ ఒకే ప్రమాణం గలవి కావు. అట్టడుగున ఉన్న వలయం అన్నిటికన్నా పెద్దది, దాని పైది కొంచెం చిన్నది, దాని పైది ఇంకా కొంచెం చిన్నది; అన్ని వలయాలకూ పైన ఉన్నది అన్నిటికన్న చిన్నది.

తరవాత బ్రహ్మదేవుడు ముగ్గురిని పిలిచి, "మీరు బ్రహ్మప్రళయందాకా జీవించేలాగు వరం ఇస్తున్నాను. మీ పని ఏమిటంటే ఈ వలయాలన్నిటినీ ఇదే క్రమంలో మూడవ కర్రకు మార్చాలి. పెద్ద వలయంమీద చిన్న వలయం ఉంచవచ్చునే గాని చిన్న వలయం మీద పెద్ద వలయం ఉంచరాదు. రెండవ కర్రను తాత్కాలికంగా వలయాలుంచటానికి మాత్రమే ఉపయోగించాలి. మీరు ముగ్గురూ వంతులు వేసుకుని ఈ పని సాగించండి. ఈ అరవైనాలుగు వలయాలూ మూడవ కర్రకు ఇదే క్రమంలో అమర్చిన క్షణాన ప్రళయం వస్తుంది!" అన్నాడు.

మరుక్షణం బ్రహ్మ అంతర్ధానమయిపోయాడు. బ్రహ్మ నియోగించినవారిలో మొదటివాడు బ్రహ్మ చెప్పినట్టు చేయసాగాడు. అతను అన్నిటికన్న చిన్నదైన మొదటి వలయాన్ని తీసి రెండవ కర్రకు

డి. కురంగేశ్వరరావు

తగిలించి, దానికంటె పెద్దదైన రెండో వలయాన్ని మూడో కర్రకు తగిలించి, దానిపై మొదటి వలయాన్ని పెట్టాడు. తరవాత మూడవదాన్ని రెండో కర్రకు పెట్టి పని సాగించాడు.

ఇది చూస్తున్నవారిలో ఒకడు, "ఈ పని ఎంతోసేపు పట్టదు. మన మానవులకు భూమిపై గల కాలం బహుకొద్ది. ఈ కొద్ది కాలంలో ఏం చెయ్యగలం?" అన్నాడు.

మూడవవాడు మాట్లాడలేదు. ఒక విఘడియ లోపల అయిదారు వలయాలు మూడవ కర్రను చేరాయి. అయినా అతను కంగారుపడలేదు. తాము ముగ్గురూ కలిసి అవిరామంగా పనిచేస్తే వలయాలను రోజుకు ఒక లక్షసార్లు ఇటూ అటూ కదిలించగలమని అతను అంచనా వేశాడు. అలాటి కదలికలు ఎన్ని పూర్తి అయితే బ్రహ్మ చెప్పిన పని ముగుస్తుందో అంచనా కట్టటానికి అతనికి చాలాకాలం పట్టింది.

అప్పటికి ప్రపంచంలో గణితశాస్త్రం లేదు. అందుచేత ఆ వ్యక్తి గణితశాస్త్రాన్ని స్వయంగా సృష్టించవలసివచ్చింది. ఆ శాస్త్రం సహాయంతో అతను ఈ వలయాలను 18, 446, 744, 073, 709, 554, 615 సార్లు మార్చితేగాని ఇవి మొదటి కర్రనుంచి మూడవ కర్రకు మారవని నిర్ధారణచేశాడు.

రోజుకు సుమారు లక్షమార్పుల చొప్పున వీటన్నిటినీ పూర్తిచేయుటానికి దాదాపు యాభైవేలకోట్ల సంవత్సరాలు పడుతుందని తెలుసుకున్నాడు. అతను తన అనుచరులతో, "సోదరులారా! ఇక ఈ పని మనం మానవచ్చు. ఎందుచేతనంటే ఇంకా యాభైవేల కోట్ల ఏళ్లదాకా బ్రహ్మప్రళయం రాదు. ఈ లోపుగా మానవులం ఎన్ని అద్భుతకార్యాలు సాధించినా సాధించవచ్చు," అన్నాడు.

అతను గుణించిన లెక్కలను మిగిలిన ఇద్దరూకూడా అర్థం చేసుకుని గణిత శాస్త్రంలో ప్రవీణులయారు.






## 3

[సర్పకేతుడి అనుచరుల కత్తిదెబ్బలకు, తన యజమాని సూర్యవర్మ మరణించటం చూసిన సుబాహుడనే సేవకుడు, ఈ సంగతి సూర్యవర్మ కుమారుడైన చంద్రవర్మకు చెప్పేందుకు, గుర్రంమీద వీరపురం బయలుదేరాడు. దారిలో అతడి గుర్రాన్ని సర్ప కేతుడి అనుచరులు చంపారు. కాలినడకను కొండ దిగిన సుబాహుడికి కాగడాలతో వున్న పల్లెవాసులు కనిపించారు. అతడు వారిని సమీపించేంతలో కొందరు రౌతులు, 'హేయ్' అంటూ అతణ్ణి చుట్టుముట్టారు. తరవాత—]

సుబాహుడు ఒక్క తృటికాలం నిశ్చేష్టు డయాడు. తన అంతం సమీపించిందని కూడా అతడు భయపడ్డాడు. తన యజమాని మరణం సంగతి వీరపురంలో తెలియ పరిచిన తరవాత, యిలాంటి ప్రమాదం వచ్చివుంటే అతడు లెక్కచేసి వుండేవాడు కాదు. ఈ క్షణాన తన చావు వీరపుర సంస్థానానికికూడా ఎంతో వినాశకరంగా పరిణమిస్తుంది. దైవకృపవలన తను, యీ రౌతులను మోసపుచ్చి పారిపోగలిగితే ఎంత బావుండును!

"ఏయ్, ఎవరు నువ్వు? మాట్లాడవేం?" అంటూ ఒక రౌతు సుబాహుణ్ణి సమీపించి, చేత్తో జుట్టు పట్టుకుని కుదిపాడు.

అంతలో జనంలోనుంచి ఒకడు, "పాపం, ఆ బిచ్చగాణ్ణి హింసించకండి! ఉపవాసాలతో మాటా పలుకూ పడిపోయి నట్టుంది!" అన్నాడు జాలిగా.




ఆ మాటలతో సుబాహుడు తెప్పరిల్లాడు. తను మామూలు బిచ్చగాడుగా నటించటం ఏమంత కష్టం కాదని అతడికి ధైర్యం కలిగింది.

"బాబూ, యింత రొట్టెముక్క! యింత..." అంటూ సుబాహుడు రౌతు కళ్ళల్లోకి జాలిగా చూస్తూ, గుర్రం కళ్ళాన్ని పట్టుకున్నాడు.

"ఛీ, యిదేం పీడ! ఎవడో వీరపురం వేగులవా డనుకున్నాను," అంటూ రౌతు గుర్రాన్ని అదిలించి ముందుకు వెళ్ళాడు.

"వీడేం వేగులవాడు! శరీరంలో ప్రాణం వున్నట్టే లేదు. యీ చింకిగుడ్డలూ వీడూ... అరే, శనిగ్రహం! నీ వంటినే మోసుకోలేని వాడికి, చేతులో ఆ లావు దుడ్డుకర్ర ఎందుకు?" అన్నాడొక రౌతు.

"కొండల్లో చిరుతపులుల్నీ, తోడేళ్ళనీ బెదరకొట్టేందుకు, దొరా," అన్నాడు సుబాహుడు తడుముకోకుండా.

ఈ జవాబు వింటూనే రౌతులతోపాటు, జనంలోనుంచికూడా కొందరు పొట్టలు చెక్కలయేలా నవ్వారు. "ఎంత గొప్ప వేటగాడివిరా నువు! కాలుతీసి కాలు పెట్టే ఓపిక లేనివాడివి చిరుతపులుల్నీ తోడేళ్లనీ బెదరకొడతావా?" అన్నారు వాళ్ళు.

"ఇంత రొట్టెముక్క పెట్టించండి, దొరా! తరవాత నా ప్రతాపం చూద్దురుగాని. వారంరోజులుగా పచ్చి మంచినీళ్లతో బతుకుతున్నాను," అన్నాడు సుబాహుడు.

రౌతులు యీ మాటలేవీ వినిపించుకోలేదు. వాళ్ళు గుర్రాలను ముందుకు వురికిస్తూ, "మీరు త్వరగా రాకాసిదిబ్బదగ్గిరకు చేరాలి. అక్కడ మీకు కావలసిన ఆయుధాలు యివ్వబడతై. తెల్లవారేలోపల వీరపురం మన గుప్పెట చిక్కుతుంది. సర్వకేత రాజుకూ, జై!" అంటూ వెళ్లిపోయారు.

సైనికులు వెళ్ళగానే, జనంలోనుంచి కొందరు ముందుకు వచ్చి, సుబాహుణ్ణి



చుట్టుముట్టారు. వాళ్ళల్లో ఒకడు సుబాహుడితో, "ఏరా అబ్బీ! చూట్టానికి యువకుడిలాగే కనబడుతున్నావు. కాలూ చేయీ కూడా బాగానే వున్నట్టున్నది. అలాంటి వాడికి ఈ బిచ్చం ఎత్తుకునే కర్మ ఎందుకు పట్టింది ?" అన్నాడు.

"అది తెలుసుకునేందుకే, యీ కొండల మీద వున్న ఒక గురువును అయిదేళ్లనుంచి సేవిస్తున్నాను, దొరా? ఆయనకు యిన్నేళ్ళుగా నామీద దయ కలగలేదు. ఇంతకు ఒక గంట ముందుగానే ఆయన ప్రసన్నుడై కొండమీదినుంచి, కాగడాలతో వున్న మీ అందరినీ చూపిస్తూ, 'ఇవ్వాళ తెల్లవారే లోపల నిన్ను యింతకాలంగా పట్టి పీడిస్తున్న శని వదిలిపోతుంది. అంతే కాదు, నీ వెంట వచ్చేవాళ్ళ శనికూడా విరగడ అవుతుంది. అదుగో, ఆ కనబడే కాగడాలదగ్గరకు వెళ్ళు!' అని సెలవిచ్చారు. దానితో హుటాహుటిగా కొండ దిగి మీదగ్గిరకు వచ్చాను," అన్నాడు సుబాహుడు.

సుబాహుడు యిలా చెప్పగానే చుట్టూ చేరిన వాళ్ళు ఒక్క క్షణకాలం ఆశ్చర్య సంభ్రమాలతో నోట మాటరాక తడబడి, అంతలోనే తెప్పరిల్లి, "ఆ కొండమీద వుండే మహాపురుషుణ్ణి గురించి చాలాకాలంగా




వినటమే గాని, చూసినవాళ్ళెవరూ లేరు. ఇవ్వాళ తెల్లవారేలోపల వీరపురాన్ని వశపరుచుకుని కొల్లగొట్టబోతున్నాం. దివ్యదృష్టి వున్నవాడు గనక, ఆయనకు ముందుగానే యిదంతా తెలిసివుంటుంది. ఇక మనకు విజయం తప్పదు. త్వరగా బయలుదేరుదాం," అన్నారు.

ఆ వెంటనే కొందరు గ్రామంలోకి పరిగెత్తి, సుబాహుడి కోసం యిన్ని రొట్టెలూ, పాలూ తీసుకువచ్చారు. సుబాహుడు తృప్తిగా వాటితో కడుపు నింపుకున్న తరవాత, అతడి ముందు కొత్తదుస్తులు పెట్టి, ఆ చింకి గుడ్డలు విప్పి, వాటిని ధరించమన్నారు. అలాంటి



దుస్తుల్లో తానెవరైందీ గుర్తించేవాళ్లు వుండ వచ్చని అనుమానించిన సుబాహుడు, వాళ్ల కేసి ఆప్యాయత ఒలికేలా చూస్తూ, "మిత్రులారా! మీ దయకు కృతజ్ఞుణ్ణి. కాని, యిప్పుడు నేని కొత్తదుస్తులు ధరించటం గురువు ఆజ్ఞను ధిక్కరించటం అవుతుంది. నన్ను పట్టి పీడిస్తున్న శని, యీనాటి సూర్యోదయం లోపల వదిలిపోతుంది. ఆ తరవాత వీటిని ధరిస్తాను," అన్నాడు.

ఆ వెంటనే, "జై ...." అంటూ కొందరు దిక్కులు పిక్కటిల్లేలా అరిచి, సుబాహుడి కేసి తిరిగి, "ఇంతకూ నీ పేరేమిటో మాకు తెలియలేదు!" అన్నారు.

"పేరా....పేరు....!" అంటూ సుబాహుడు కొంచెం తడబడి, "తల్లి దండ్రులు పెట్టిన పేరు ఏదయితేం? శనిచేత యింత కాలంగా పీడించబడుతున్నవాణ్ణి. గురువాజ్ఞ మేరకు అది వదలగానే........" అంటూండ గానే, జనంలోనుంచి ఒకడు, "ఇవ్వాళతో మనందరి శనీ వదులుతుంది! ఈనాటి నుంచీ నీపేరు శనిమర్దనుడు," అన్నాడు. వెంటనే "శనిమర్దనుడికీ, జై!" అన్న కేకలు మిన్నుముట్టినై.

తరవాత అందరూ కాగడాల వెలుగులో రాకాసిడిబ్బ దగ్గరకు బయలుదేరారు. తన వెంట వున్నవాళ్లు మాట్లాడుకునేదాన్నిబట్టి,



వాళ్లంతా కటిక దరిద్రులనీ, సర్పకేతుడు ధనధాన్యాలు దొరుకుతవని ఆశ కల్పించటం వల్లనే, వాళ్లు వీరపురంకేసి బయలుదేరుతున్నారనీ గ్రహించాడు సుబాహుడు.

"నాకు వీరపురాన్ని గురించి బాగా తెలియదు. దాని సామంతుడైన సూర్యవర్మ అంత ప్రజాకంటకుడా?" అని సుబాహుడు జనంలో ఒకడిని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే అతడు నవ్వి, "ఈ సామంతుల్లో ప్రజాకంటకుడు కానివాడెవడు? సూర్యవర్మ సంగతి మాకు తెలియదుగాని, సర్పకేతుడికన్న జనకంటకుడు మరొకడు పుట్టబోడు," అన్నాడు.

"అలా అయితే, వీరపురాన్ని దోచుకోవటానికి మనం ఎందుకు వెళ్లాలి? ఆ విధంగా మనం సర్పకేతుడికి సాయం చేసినవాళ్లమవుతాంగదా!" అన్నాడు సుబాహుడు.

ఆసరికి వాళ్లిద్దరి సంభాషణలో మరి నలుగురైదుగురు వచ్చి పాల్గొన్నారు. వాళ్లు సుబాహుడి ప్రశ్నలకు వింతగా నవ్వి, "మనం సర్పకేతుడికి సహాయం చేయటానికి వెళ్లటం లేదు. వీరపురాన్ని కొల్లగొట్టేందుకు అతడు సహాయం చేస్తానన్నాడు. మనం అక్కడినుంచి తెచ్చుకోగలిగినదంతా మనదే; అందులో అతడికిగానీ, అతడి సైనికులకుగానీ పాలుండదు," అన్నారు.





అమాయకత్వం, దురాశా కరుడుకట్టిన యీ పల్లెవాసులతో తను ఏం మాట్లాడినా లాభంలేదని సుబాహుడు గ్రహించాడు. వాళ్ల దృష్టిలో తమను పాలించే సామంతులందరూ ఒకటే. వీలయినప్పుడల్లా యితరులు తమను దోచుకుంటున్నారు, అదే విధంగా అవకాశం చిక్కితే తామూ యితర్లను కొల్లగొడతారు—అదీ వాళ్ల మనస్తత్వం.

కొద్దిసేపటి తరవాత అందరూ రాకాసి దిబ్బప్రాంతానికి చేరారు. ఆ సరికే అక్కడ వందల సంఖ్యలో జనం చేరివున్నారు. వాళ్ళల్లో చాలామందిదగ్గిర వెలుగుతున్న పెద్దపెద్ద కాగడా లున్నవి. వాళ్లందరినీ కొందరు సైనికులు సోలుపులుగా నిలబెడుతున్నారు. సుబాహుడు వున్న ముఠాను కూడా ఒకచోట నిలబెట్టారు.

ఆ తరవాత దళనాయకుల దుస్తుల్లో వున్న కొందరు అశ్వికులు ముందుకు వచ్చి అక్కడ చేరిన జనాన్ని వుద్దేశించి యీ విధంగా చెప్పారు:

"మహాశక్తి సంపన్నుడూ, దయామయుడూ అయిన సర్పకేతరాజు సహాయం వల్ల మీరు యీనాటితో దారిద్ర్య బాధనుంచి విముక్తులవుతారు. ఇప్పటి సమస్య ఏమిటంటే, వీరపుర పట్టణంలో ఎలా ప్రవేసించటమా అనేది. పట్టణ ద్వారపాలకుల్ని మోసగించి, ఒకసారి ద్వారాలు తెరిచేలా చేశామంటే, ఆ తరవాత మనకు పట్టణంలో అడ్డు నిలబడగల శక్తి ఏమీ వుండదు. కనుక, మీలో ఒక వందమంది ముందుగా పట్టణ ద్వారాలను సమీపించి, హాహాకారాలు చేస్తూ, సర్పకేతరాజు సైనికులు మీ గ్రామాలమీద పడి దోచుకుంటూన్నట్టు ఆర్తనాదాలు చేయండి. ఆ కేకలకు కాపలావాళ్లు ద్వారాలు తెరుస్తారు. వెంటనే మీరు పక్కకు తొలిగి దారియిస్తే, పౌరదుస్తుల్లో వున్న మా సైనికులు పట్టణంలో జొరపడతారు. వారి

వెనకగా ప్రవేశించి మీరు, మీ యిష్టంవచ్చి నట్టు నగరాన్ని కొల్లగొట్టవచ్చు. మీరు మాత్రం వీలయినప్పుడల్లా యశోవర్ధన మహా రాజుకూ, జై అంటూమాత్రం నినాదాలు చేస్తూవుండాలి. యశోవర్ధన మహారాజు పంపగా వచ్చినవారని భ్రమపడి, సూర్య వర్మ సైనికుల్లో కొందరైనా మిమ్మల్ని ఎదుర్కొనేందుకు భయపడతారు. మిగిలిన వాళ్లను పౌరదుస్తుల్లో వుండే మా సైనికులు హతమారుస్తారు. ఏ పరిస్థితుల్లోనూ మీరు సర్పకేతరాజు పేరు ఉచ్చరించరాదు."

దళనాయకుల మాటలు ముగిసేలోపలే జనంలోనుంచి 'యశోవర్ధన మహారాజుకూ, జై!' అన్న కేకలు వినిపించినై. వీరపురాన్ని ఆక్రమించుకోవటానికి యింత నిగూఢమైన కుట్ర జరుగుతున్నదని అర్థం కాగానే సుబాహుడు నిర్విణ్ణుడయాడు. తను వీళ్లనుండి విడివడి ముందుగా వీరపురం ప్రవేశించి చంద్రవర్మకు యీ మోసాన్ని గురించి తెలియపరచగలితే ప్రమాదం జరగకుండా అతణ్ణీ, నగరాన్నీ రక్షించవచ్చు. కాని, వీళ్ళందరి దృష్టినుంచీ తప్పుకుని పారి పోవటం ఎలా?

సుబాహుడు యీ విధంగా ఆలోచిస్తు న్నంతలో జనం మహాప్రవాహంలా ముందుకు



కదిలారు. వాళ్ళల్లో చాలామంది పౌర దుస్తుల్లో వున్న సర్పకేతుడి సైనికులని ఆతడు గుర్తించగలిగాడు. అందరికన్న ముందు పరుగులు తీస్తున్న ఓ వందమంది ప్రజలతో సుబాహుడు కలిశాడు. చూస్తూండ గానే వాళ్ళు పట్టణద్వారాలను సమీ పించారు. వెంటనే జనంలో కొందరు శోకి స్తున్నట్టుగా ఎలుగెత్తి, "అయ్యో, ద్వారాలు తెరవండి! సర్పకేతుడి సైనికులు మా గ్రామాలమీద పడి కనపడిందల్లా దోచు కుంటూ, ప్రజలను హింసిస్తున్నారు. మాకు వెంటనే సైనిక సహాయం కావాలి!" అని కేకలు పెట్టారు.



పట్టణద్వారాల వెనక వున్న కాపలా వాళ్ళు, ద్వారాలు తెరవటమా మానటమా అని సందేహించేలోపలే, జనంలోనుంచి మరి కొందరు భయకంపితులైన వాళ్ళలా, "అయ్యో, మాకు సూర్యవర్మరాజులంవారే దిక్కు! మా మొర వారికి చెప్పుకోనీయండి," అంటూ బిగ్గరగా అరిచారు.

ఆ వెంటనే ద్వారాలు తెరవబడినై. అప్పటివరకూ వాటిదగ్గిర వున్నవాళ్ళు పక్కలకు తప్పుకున్నారు. మరుక్షణంలో పౌర దుస్తుల్లో వున్న సర్పకేతుడి సైనికులు, అప్పటివరకూ దాచివుంచిన ఆయుధాలు బయటికి తీసి కాపలావాళ్ళమీద పడి, చూస్తూండగానే కొందరిని చంపి, మిగతా వారిని ఖైదీలుగా పట్టుకున్నారు. జనం రణగొణ ధ్వని చేస్తూ ఒక్కుమ్మడిగా ముందుకు కదిలారు.

సుబాహుడు ఒక్క గంతులో ద్వారం దాటి, పెనుగులాడుతున్న కాపలా వాళ్ళ పక్కనుంచి ముందుకు పరిగెత్తాడు. అదే సమయంలో వెనకనుంచి కేకలూ, చప్పట్లూ వినిపించినై. "ఎవడా పరిగెత్తేది? జనం అంతా కలిసికట్టుగా వెళ్ళాలి. వాణ్ణి పట్టుకోండి!"

మరుక్షణం నలుగురైదుగురు సర్పకేతుడి సైనికులు, "ఆగు, ఆగు!" అంటూ సుబాహుడి వెంటబడ్డారు. తను, చావో బతుకో తేల్చుకోవలసిన సమయం ఆసన్నమయిందని సుబాహుడు నిశ్చయించుకుని, చెంగున వెనుదిరిగి, సమీపిస్తున్న సైనికుణ్ణి ఎగిరి డొక్కలో బలంగా తన్ని, వాడు వెనక్కుపడిపోయేలోపల, వాడి చేత గల కత్తిని లాక్కున్నాడు. ఇంతలో మరొక సైనికుడు అతణ్ణి సమీపించాడు. సుబాహుడు తన కత్తితో వాణ్ణి బలంగా గుండెల్లో పొడిచి, మరికొందరు సైనికులు రావటం గమనించి, తక్కున వెనుదిరిగి రాజప్రాసాదంకేసి పరిగెత్తసాగాడు. —(ఇంకా వుంది)





# కీలుగుర్రం

## 4

[సాబూర్ చక్రవర్తి కుమారుడైన అక్మార్ కీలుగుర్రం సహాయంతో సనానగరం చేరి అక్కడి రాజకుమార్తెను చూసి ప్రేమించాడు. సనారాజు అపవాదుకు వెరచి అక్మార్‌కూ, తన కుమార్తె సహార్‌కూ రహస్యంగా పెళ్లిచేయ తలపెట్టాడు. ఇలాటి పెళ్లి ఇష్టం లేక అక్మార్ మాయోపాయం చేసి సనానుంచి తప్పించుకుని ఇంటికి వచ్చి, తనకు కీలుగుర్రం ఇచ్చిన సిద్ధుణ్ణి ఖైదునుంచి విడిపించాడు. తరవాత వారంరోజులకు అతను సనాకు తిరిగి వెళ్లి ఎవరికీ తెలియకుండా సహార్‌ను కలుసుకుని ఆమెతోసహా తన దేశానికి తిరిగి వచ్చి, ఆమెను నగరం వెలపల ఉద్యానంలో ఉంచి తాను ఒంటరిగా తన తండ్రివద్దకు వెళ్లాడు. సహార్‌ను తీసుకురావటానికి చక్రవర్తి బాజాభజంత్రీలతోసహా బయలుదేరాడు. కాని అక్కడ ఉద్యానంలో రాజకుమార్తె మాయమయింది. కీలుగుర్రం కూడా మాయమయింది.]

అక్మార్‌కు గుండె ఆగిపోయినట్టయింది. అతను వెర్రివాడిలాగా అయిపోయి, తన ప్రియురాలిని ఎలుగెత్తి పిలుస్తూ అన్ని దిక్కులా పరిగెత్తాడు. కాని ఈ వెర్రి ఆవేశం కాస్త అణిగినాక అతని బుద్ధి తిరిగి పని చెయ్యసాగింది.

రాజకుమార్తె సహార్ గుర్రంపైన ఎక్కైనా వెళ్ళి ఉంటుందా అని అతనికి అనుమానం తగిలింది. కాని ఆమెకు కీలుగుర్రం కిటుకు తెలియదు; అతను చెప్పలేదు.

"సహార్ గుర్రాన్ని తీసుకుని వెళ్ళి ఉండదు. సిద్ధుడే పగకొద్దీ గుర్రాన్నీ,

ఆర్. దయానందరావు

రాజకుమారైనూ తీసుకుని పారిపోయి ఉంటాడు," అనుకున్నాడు అక్మార్.

ఈ అనుమానం తగలగానే అతను ఉద్యానపాలకులవద్దకు వెళ్ళి, "ఈ ఉద్యానంలోకి మరెవరైనా వచ్చారా? నిజం చెప్పండి, లేకపోతే మీ ప్రాణాలు తోడేస్తాను!" అన్నాడు.

ఉద్యానపాలకులు భయపడుతూ, "మరెవరూ రాలేదు, మహారాజా. ఏవో మూలికలు కావాలని సిద్ధుడు మాత్రం వచ్చాడు. అయన తిరిగి బయటికి వెళ్ళిపోలేదు, ఉద్యానంలోనే ఎక్కడో ఉండి ఉంటాడు!" అన్నారు.

అక్మార్ భయపడినంతా జరిగింది. సిద్ధుడు పగ తీర్చుకున్నాడు. పొంగివచ్చే దుఃఖాన్ని అపుకుంటూ రాజకుమారుడు ఉద్యానంకేసి వచ్చే ఊరేగింపుకు ఎదురు వెళ్ళి తన తండ్రితో జరిగిన సంగతి చెప్పాడు.

"నాన్నా, ఈ సైనికుల నందరినీ తీసుకుని ఇంటికి తిరిగి వెళ్లు. ఈ మోసం అంతు తేల్చినదాకా నేనింటికి రాను!" అన్నాడతను తండ్రితో.

చక్రవర్తి కళ్ళనీళ్ళ పర్యంతమయాడు. తన ఏకైక పుత్రుడు ఇంతటి ఘోర శపథం పూనటం ఆయనకు చాలా బాధ కలిగించింది.



"వృథాగా ఎందుకు శ్రమపడతావు, నాయనా? నువు వెళ్లిపోతే నేనేమైపోయేది? నీ కోపాన్నీ, దుఃఖాన్నీ దిగమింగుకుని నాతో ఇంటికి వచ్చెయ్యి. నీకు కావాలంటే ప్రపంచంలో గల ఏ రాజకుమార్తెనైనా తెచ్చి ఇస్తాను! నహర్ కోసం అంతగా విచారించకు!" అన్నాడాయన కొడుకుతో.

కాని ఈ మాటలు అక్మార్ చెవికెక్కలేదు. అతను తొందర తొందరగా తన తండ్రికి వీడ్కోలు చెప్పి తానెక్కి ఉన్న గుర్రం మీద అతివేగంగా వెళ్లిపోయాడు. చక్రవర్తి కంటివెంట కన్నీరు కార్చుతూ, నిస్పృహతో ఇంటికి తిరిగి వెళ్లాడు. ఆయన ఎంత సంతోషపడ్డాడో అంత నిరాశా, దుఃఖమూ ఆయనకు దాపరించాయి.

ఆ రోజు ప్రాతఃకాలపువేళ మూలికలు ఏరుకుందామనే పర్షియా సిద్ధుడు ఆ ఉద్యానం ప్రవేశించాడు. కాని లోపలికి రాగానే కస్తూరీ, పునుగూ, జవ్వాది మొదలైన పరిమళాలు ఆయనకు తగిలాయి. సిద్ధుడు ఆశ్చర్యంతో ఆ వాసనలనుబట్టి వెళ్లి మంటపాన్ని చేరేసరికి అక్కడ ఆయనకు తాను తయారుచేసిన కీలుగుర్రం కనిపించింది.

వెంటనే సిద్ధుడికి పంచప్రాణాలూ లేచి వచ్చినట్టయింది. ఈ గుర్రాన్ని పోగొట్టుకున్న నాటినుంచీ అయన మనస్సుకు శాంతి






అన్నది లేదు, నిద్రాహారాలు లేవు." ఆయన దాన్ని పరీక్షచేసి దాని కీళ్లు యూవత్తూ సరిగా ఉన్నట్టు తెలుసుకున్నాడు. దానిమీద ఎక్కి వెళ్లిపోదా మనుకునేటంతలో ఆయన కొక ఆలోచన తట్టింది. రాజకుమారుడు ఈ గుర్రంపై ఇంకెవరినో తెచ్చిఉంటాడు. వారిని ఈ మంటపంలో దించి, వారి కాపలాకిందనే ఈ గుర్రాన్ని ఇక్కడ వదిలిపెట్టి ఉంటాడు.

ఆ మనిషి ఎవరో చూతామని సిద్ధుడు మంటపంలో ప్రవేశించేసరికి, సూర్యుడిలాగా వెలిగిపోతూ శయ్యపై పడుకునిఉన్న రాజకుమార్తె నహార్ ఆయన కంట పడింది. ఆమె సామాన్యురాలు కాదనీ, గొప్ప పుటక పుట్టిన మనిషి అయిఉంటుందనీ, ఆమెను ఆడంబరంగా నగరంలో ఊరేగించి తీసుకుపోయే ఉద్దేశంతోనే రాజకుమారు డామెను ఊరిబయట ఈ ఉద్యానవనంలో దించాడనీ ఆయన గ్రహించాడు. ఆయన రాజకుమార్తెను సమీపించి సలాము చేసి పలకరించాడు.

రాజకుమార్తె మెల్లిగా కనురెప్పలు ఎత్తి సిద్ధుడికేసి చూసి, ఆయన వికారాకారం కంట పడేసరికి వెంటనే కళ్లు గట్టిగా మూసేసుకుని, "ఎవరు నువ్వు?" అని అడిగింది.

"మహారాణీ, నేను రాజకుమారుడి నౌకరును. మా యజమాని మిమ్మల్ని ఇంకొక మంటపానికి చేర్చమన్నారు. అది ఇంతకంటె కూడా బాగుంటుంది. అదీగాక నగరానికి అది ఇంతకన్న దగ్గిర. అసలు విషయమేమిటంటే పెద్దరాణీగారికి ఒంట్లో అంత బాగాలేదు. తమరిని తోడ్కొని పోవటానికి వారు ఇంతదూరం రాలేరు!" అన్నాడు సిద్ధుడు.

"ఇంతకూ మీ యువరాజుగారేరీ?" అన్నది రాజకుమార్తె.

"వారు చక్రవర్తిగారి వెంట ఉన్నారు. అందరూ కలిసి మేళతాళాలతో, బాజా

భజంత్రీలతో వచ్చి తమరిని తీసుకు పోతారు," అన్నాడు సిద్ధుడు.

" అంతా బాగానే ఉందిగాని యువరాజు గారు నీవంటి అందవికారమైన మనిషిని పంపారేమిటి ?" అన్నది రాజకుమార్తె.

సిద్ధుడికి ఈమాట శూలంలాగా తగిలి బాధకలిగింది. కాని ఆయన ఆబాధను పైకి కనపడనివ్వక, పాలిపోయిన తన ముఖ మంతా ముడతలు పడేలాగా నవ్వుతూ, " ఆ మాట నిజం, మహారాణీ! దివాణంలో నాకన్న అందవికారమైన మనిషి లేడు. అయినా నా సామర్థ్యం యువరాజుగారికి తెలుసు, త్వరలోనే తమకుకూడా తెలు స్తుంది, అప్పుడు నన్ను తమరుకూడా మెచ్చుకుంటారు. అందమైన నౌకర్లు ఎంతో మంది ఉన్నా, వాళ్లను పంపటం ఇష్టం లేకనే యువరాజుగారు నన్ను పంపారనుకో రాదా ?" అన్నాడాయన.

ఈ మాటతో రాజకుమార్తెకు ఆ ముసలి వాడిపై నమ్మకం కుదిరింది.

ఆమె శయ్యమీద నుంచి లేచి నిలబడి, " నన్ను ఏమి ఎక్కించి తీసుకుపోతావు ?" అని సిద్ధుణ్ణి అడిగింది.

" ఇదుగో, ఈ కీలుగుర్రం ఉన్నదిగా ?" అన్నాడు సిద్ధుడు.



" నాకు దానిమీద స్వారిచెయ్యటం చేత కాదే ?" అన్నదామె.

"నాకు తెలుసును. నావెనక ఎక్కండి!" అంటూ సిద్ధుడు గుర్రంఎక్కి కూచున్నాడు. రాజకుమార్తె ఆయన వెనక ఎక్కి కూచున్నది. ఆమెను తన నడుముకు భద్రంగా కట్టేసి సిద్ధుడు గుర్రాన్ని కదిలించే మీట నొక్కాడు. గుర్రం సూటిగా ఆకాశం లోకి లేచింది. కొద్దిక్షణాలలో నగరం కంటికి కనపడకుండా పోయింది.

" మీ యజమాని చెప్పినదేమిటి ? నువు చేస్తున్నదేమిటి ?" అని రాజకుమార్తె ముసలివాణ్ణి అడిగింది.

"నా యజమానా? నాకు యజమాని ఎవడు?" అన్నాడు సిద్ధుడు.

"యువరాజుగారు!" అన్నది రాజకుమార్తె.

"ఏదేశపు యువరాజు? నువ్వు మాట్లాడేది రాజకుమారుడు అక్మార్‌గురించా? వాడు వట్టి చవట, పనికిమాలిన వాజ!" అన్నాడు సిద్ధుడు కోపంగా.

"నీ యజమానిని గురించి ఇలాగేనా మాట్లాడేది. ముసలి పీనుగా?" అన్నది రాజకుమార్తె.

"వాడు నా యజమాని అంటావేమిటి? నేనెవరో నీకు తెలుసా?" అన్నాడు సిద్ధుడు.

"నువు చెప్పినమాటలు తప్ప నాకు వేరే ఏమీ తెలీదు," అన్నది రాజకుమార్తె.

"అవన్నీ నిన్ను మోసంచెయ్యటానికీ, ఆ అక్మార్‌ను మోసంచెయ్యటానికీ ఆడిన అబద్ధాలు. నేను కష్టపడి తయారుచేసిన ఈ గుర్రాన్ని వాడు కాజేసి నన్ను మహా ఏడిపించాడు! ఇక వాణ్ణి ఏడవనీ! నువు ధైర్యంగా ఉండు. ఆ చవటకన్న నేను నిన్ను వెయ్యిరెట్లు బాగా చూస్తాను. నీకు అంతులేని బట్టలూ, సగలూ ఇస్తాను. వేలకు వేలు దాసీజనాన్ని ఇస్తాను. రాజాధిరాజులకుకూడా సాధ్యంగాని వైభవం నీకు జరిపిస్తాను!" అన్నాడు సిద్ధుడు.



రాజకుమార్తె, "అయ్యో, దేవుడా! నాకీ దుర్గతి ఏమిటి? మొదట తల్లిదండ్రులకు దూరమై, ఇప్పుడు నా ప్రియుడికికూడా కాకుండాపోయానా?" అని కంటనీరు గార్చుతూ ఏడవసాగింది.

సిద్ధుడు తన గుర్రాన్ని రూమ్‌దేశానికి తీసుకుపోయి ఒక పచ్చని బయలులో దింపాడు. అక్కడ చక్కని సెలయేళ్లు పారుతున్నాయి. ఈ బయలుపక్కనే ఒక నగరం ఉన్నది. దాన్ని ఒక సుల్తాను పాలిస్తున్నాడు. గుర్రం బయలులో దిగిన సమయానికే ఆ సుల్తాను అక్కడికి షికారుగా వచ్చాడు. గుర్రం నుంచి దిగిన మరుక్షణమే సుల్తాను భటులు సిద్ధుణ్ణి చుట్టుముట్టి పట్టేశారు. వారు ఆయననూ, రాజకుమార్తెనూ, కీలుగుర్రాన్నీ తీసుకుపోయి సుల్తాను ఎదట ఉంచారు.

సుల్తాను సిద్ధుణ్ణీ రాజకుమార్తెనూ చూసి నిర్ఘాంతపోయాడు. ఒకే కంటితో లోకంలో కల్లా అందవికారమైన మగవాణ్ణీ, అందగత్తె అయిన ఆడదాన్నీ చూసినట్టు సుల్తానుకు తోచింది.

"ఏమమ్మా? కాకి ముక్కుకు దొండపండు కట్టినట్టు నిన్ను ఈ ముసలిముచ్చుకు ఎలా ముడిపెట్టారు?" అన్నాడు సుల్తాను రాజకుమార్తెతో.





" ఈమె నా బంధువురాలేనండీ! మాకు చాలాకాలం కిందటే వివాహమయింది!" అన్నాడు సిద్ధుడు, రాజకుమార్తె జవాబు చెప్పేలోగా.

"అన్నీ పట్టిది, బాబూ! ఈ ముసలి పీనుగు ఎవడో నేనసలు ఎరగను. వీడు మంత్రగాడు. నన్ను మోసగించి బలాత్కారంగా తెచ్చాడు," అని రాజకుమార్తె నిజం చెప్పేసింది.

ఈ మాటలు విని రూమ్ సుల్తాను ముసలి వాణ్ణి కొట్టమని భటులకు ఉత్తరువిచ్చాడు. వాళ్లు సిద్ధుణ్ణి కసితీర కొట్టేసరికి సిద్ధుడు చచ్చినంత పని అయింది.

తరవాత సుల్తాను సిద్ధుణ్ణీ, రాజకుమార్తెనూ, కీలుగుర్రాన్నీ నగరానికి వెంట పెట్టుకుపోయి, సిద్ధుణ్ణి ఒక చీకటికొట్టులో తోయించి, గుర్రాన్నీ, రాజకుమార్తెనూ తన యింటికి తీసుకుపోయాడు. ఆ కీలుగుర్రంలో ఉండే విశేషంమటుకు సుల్తానుకు ఏమీ తెలియదు.

ఈలోపల రాజకుమారుడు అక్మార్ గుర్రంమీద తన ప్రియురాలిని వెతుకుతూ బయలుదేరి ఒక్కొక్క నగరమే చేరి, అక్కడివారిని, " మీరీ నగరంలో ఒక కీలు గుర్రాన్ని చూశారా ?" అంటూ దాని శక్తులను వర్ణించసాగాడు.

అతని ప్రశ్న విన్నవారు ఒక్కరుకూడా అతని మాటలు నమ్మలేదు. పైపెచ్చు అతనికి మతి చెడిందనికూడా అనుమానపడ్డారు.

అక్మార్ రాజకుమారుడు ఇలా చాలా రోజులు ప్రయాణం చేసి సనానగరం చేరి అక్కడి ప్రజలనుకూడా అదేవిధంగా ప్రశ్నించాడు. సనానగరవాసులకు రాజకుమార్తె జాడగానీ, కీలుగుర్రం జాడగానీ తెలియకపోవటం అటుంచి. రాజూ, రాణీ తమ కుమార్తె కోసం బెంగపడి విచార సముద్రంలో మునిగిఉన్నారని అతనికి తెలియవచ్చింది.

అక్మార్ ఇక అక్కడ నిలవక ముందుకు సాగి, మరికొంత కాలానికి మరొక నగరం చేరాడు. అక్కడ అతను దిగిన బసలోనే కొందరు వర్తకులుకూడా దిగారు. వారంతా కబుర్లు చెప్పుకునే సందర్భంలో ఒకడు, "అయ్యా, ఈమధ్య నేను రూమ్‌నగరం వెళ్లినప్పుడు అక్కడ ఒక వింత విషయం విన్నాను. ఒకనాడు అక్కడి సుల్తానుగారు వేటకు వెళితే ఆయనకు ఒక వికారాకారుడైన ముసలివాడూ, భూలోకరంభలాటి యువతీ తటస్థపడ్డారట. అంతకన్న చిత్రమేమిటంటే వారివెంట చంద్రకొయ్యతో చేసిన గుర్రం ఉన్నది," అంటూ చెప్పుకుపోయాడు. ఆ కథ వింటున్న అక్మార్‌కు తాను వెతకబోయిన తీగె కాలికి తగిలినట్టయింది. అతను వెంటనే రూమ్‌నగరం ఎటు వైపుగా ఉన్నదీ, అక్కడికి ఎంతదూరంలో ఉన్నదీ ఆరా తీసి జాగు చేయకుండా అక్కడికి ప్రయాణమయాడు.

అతను నగరం ప్రవేశించేటప్పుడు నగర ద్వారపాలకులు అతనిని పట్టుకుని సుల్తాను ప్రశ్నించటానికిగాను నిలిపారు. నగరానికి వచ్చే పరదేశీలను సుల్తాను ప్రశ్నించటం ఆ నగరపు ఆచారం. అయితే ఆ రోజు అప్పటికే చాలా పొద్దుపోయి ఉండటంచేత సుల్తానుగారి దర్శనం మర్నాడు ఉదయానికిగాని



దొరకదు. అందుచేత వారు అక్మార్‌ను ఆ రాత్రి ఖైదులో ఉంచటానికి తీసుకుపోయారు.

అయితే ఏ అపరాధమూ చెయ్యని ఆ యువకుణ్ణి తెల్లవార్లూ ఖైదులో ఉంచడం వారికే బాధ అనిపించింది. వారు అతన్ని తమతోపాటు భోజనం చెయ్యమని ఆహ్వానించి, భోజనాలయాక తమలో తాము కబుర్లు చెప్పుకోసాగారు.

మధ్యలో ద్వారపాలకులలో ఒకడు రాజకుమారుడికేసి తిరిగి, "నువు ఏ దేశంనుంచి వస్తున్నావు, బాబూ?" అని అడిగాడు.

"మాది పర్షియా!" అన్నాడు అక్మార్. ఈమాట విని అందరూ నవ్వారు.

"మీ దేశంవాడే ఒకడు చీకటి కొట్లో ఉన్నాడు. అబ్బ, వాడు ఏం బడాయిలు చెబుతాడని! అంత అబద్ధాలాడేవాణ్ణి ఎక్కడా చూడలేదు. నువుకూడా అలాటివాడివి కావు గద? పైపెచ్చు వాడు ఎంత వికారంగా ఉంటాడో చెప్పటానికి లేదు!" అన్నాడొకడు.

"వాడేమి అబద్ధాలు చెప్పాడేం?" అని అక్మార్ అడిగాడు.

"ఒకటేమిటి? వాడు సిద్ధుడుట, వైద్యం చేస్తాట్ట! మా సుల్తానుగారు ఒకనాడు షికారు వెళితే వారికి దారిలో ఈ ముసలివాడూ, ఒక అప్సరసలాటి అమ్మాయీ, ఒక అద్భుతమైన కొయ్యగుర్రమూ దొరి



కాయి. ఆ అమ్మాయి ఎంత అందంగా ఉంటుందో చెప్పటానికి లేదు. మా సుల్తాను గారు ఆమెను పెళ్ళాడదామనికూడా అనుకున్నారు; కాని అంతలోనే ఆ పిల్లకు పిచ్చెత్తిపోయింది. ముసలాడు నిజంగా వైద్యం తెలిసినవాడైతే ఆమెకు పిచ్చి నయం చెయ్యరాదూ? అది వాడి తరమా? సుల్తాను గారు ఎంతోమంది హేమాహేమీలచేత చికిత్స చేయించారు. ఎంతో డబ్బు ఖర్చు చేశారు. కాని ఆ పిచ్చి నయం కాకుండా ఉంది!" అన్నారు వాళ్ళు.

"ఇంతవరకు వ్యవహారం సవ్యంగానే నడిచింది. ఇప్పుడు నేనేం చెయ్యాలి?" అని రాజకుమారుడు అక్మార్ తనలో తాను వితర్కించుకున్నాడు.

పడుకునే వేళ అయేసరికి కాపలావాళ్లు రాజకుమారుణ్ణి ఖైదులో ఒక గదిలో పెట్టి, దానికి జాగ్రత్తగా తాళం వేసి తమ దారిన తాము వెళ్లి పడుకున్నారు.

అక్మార్‌కు నిద్ర పట్టలేదు. చీకటికొట్టులో బంధించి ఉన్న సిద్ధుడు మూలుగుతూ తనలో తాను పర్షియాదేశపు భాషలో మాట్లాడుకుంటూ ఉండటం అతనికి వినపడింది.

"ఎంత దౌర్భాగ్యుణ్ణి! నేను వేసిన పాచిక ఒకటీ పారకపోయెనే! చెయ్యి చిక్కిన పిట్ట దక్కకపోయెనే!" అని ముసలివాడు వాపోతున్నాడు.

అక్మార్ సిద్ధుణ్ణి గుర్తించి, "అదృష్టహీనుడివి నువు ఒకడివే ననుకున్నావా? ఎందుకా ఏడుపు?" అన్నాడు తమ భాషలో.

ఈ మాటలు విని సిద్ధుడికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఆ మాట్లాడినది అక్మార్ అని వాడు గ్రహించలేదు. అందుచేత తాను వేసిన ఎత్తూ, అది విఫలమైన విధమూ అతనికి సిద్ధుడు పూసగుచ్చినట్టు చెప్పాడు. తెల్లవార్లూ ఆ ఇద్దరూ ఆప్తస్నేహితులులాగా సంభాషించుకున్నారు.

—(ముగింపు పై సంచికలో)





# కోడి ఖరీదు

ఒక గ్రామంలో పేరయ్యా అనే కుమ్మరి ఉండేవాడు. ఒకవీడు సంక్రాంతి వచ్చింది. పేరయ్యాను అతని భార్య కోడిని కొనుక్కు రమ్మని అడిగింది. ఆ గ్రామంలోని పెద్ద భూస్వామి అయిన కోటయ్యా వద్దకు వెళ్లి పేరయ్యా తనకు ఒక కోడిని అమ్మవలసిందిగా అతణ్ణి అడిగాడు.

కోటయ్యా పేరయ్యాకు ఒక కోడిపెట్టను ఇచ్చి, "చేతిలో ఇప్పుడు డబ్బు లేకపోతే తరవాతనే ఇయ్యి, లెక్క రాయించి ఉంచుతాను," అన్నాడు. పేరయ్యాకు ఈమాత్రం ఆదరం చూపినవారెవరూ లేరు. అందుచేత అతను కోటయ్యా దయాధర్మాలను చాలా సేపు మెచ్చుకొని ఇంటికి వెళ్లాడు.

ఆ రోజు పేరయ్యా, అతని భార్యా కోడిని వండుకు తిన్నారు. కొంతకాలం గడిచాక పేరయ్యా భూస్వామికి కోడి బాపతు సొమ్ము ఇవ్వటానికి వచ్చాడు.

"ఇప్పుడు నేను పనిమీద ఉన్నాను. ఆ లెక్క చూడాలంటే చాలాసేపు పడుతుంది, తరవాత కనపడు!" అన్నాడు కోటయ్యా.

"కోడిఖరీదు పుచ్చుకోపటానికి లెక్క చూసేదేముందండీ? ఎంత ఇయ్యమంటారో చెప్పండి, ఇచ్చి నా దారిన నేను పోతాను!" అన్నాడు పేరయ్యా.

"అబ్బో, దానికి చాలా పెద్ద లెక్క ఉంది," అని కోటయ్యా పేరయ్యాను పంపేశాడు.

పేరయ్యా కోటయ్యాచుట్టూ నాలుగైదు సార్లు తిరిగినాక, కోటయ్యా కాగితమూ, కలమూ తీసుకుని గంటసేపు ఏవేవో లెక్కలు వేసి చివరకు, "నీ కోడిబాపతు లెక్కంతా కలిసి రెండువందల యాభైరూపాయల చిల్లర అయింది. చిల్లర దేమిటిలే, రెండు వందల యాభై ఇచ్చెయ్యి, నీ పద్దు కొట్టేస్తాను," అన్నాడు.

వి. రామరాజు

తాను తిన్న కోడిఖరీదు రెండువందల యాభై రూపాయలని వినగానే పేరయ్యకు కొంతసేపు నోటమాటకూడా రాలేదు. "ఒక్క కోడి ఖరీదు రెండు వందలయాభై రూపాయలా? ఎక్కడా విననుకూడా లేదే? అదేమన్నా బంగారపు కోడా?" అని అతను కోటయ్యను అడిగాడు.

"లెక్కలో తభావతు ఏమీ లేదు. కావలిస్తే నీ యిష్టంవచ్చిన వాళ్లచేత లెక్క వేయించుకో. నువు తినుకున్న కోడిపెట్ట ఇప్పటికి ఎన్ని గుడ్లు పెట్టేది? అవి పిల్లలై పెరిగి ఎన్ని గుడ్లు పెట్టేవి? వాటన్నిటి ఖరీదూ నువ్విచ్చుకోవలిసిందే," అన్నాడు కోటయ్య. ఈ మాటలు వినేసరికి పేరయ్య ఆశ్చర్యం పదింతలయింది.

"ఈ సంగతేమిటో ఏ మునసబుగారి నన్నా అడిగి తేల్చుకోకుండా నేనొక్క దమ్మిడీ ఇయ్యను," అన్నాడు పేరయ్య.

"మహరాజుగా అడుగు. నే కాదన్నానా?" అన్నాడు కోటయ్య. మునసబు తనకు అనుకూలంగా తీర్పు చెబుతాడని భూస్వామి కోటయ్యకు తెలుసు.

ఇద్దరూ కలిసి మునసబుదగ్గిరికి వెళ్లారు. కోటయ్య మునసబుతో, "మునసబుగారూ, ఈ పేరయ్య మొన్నటి సంక్రాంతికి కాక ఆ కిందటి సంక్రాంతికి నాదగ్గిర కోడిపెట్ట



కొన్నాడు. దాని బాపతు సొమ్ము ఇస్తా నంటున్నాడు. ఆ కోడి ఇప్పటికి ఎన్ని గుడ్లు పెట్టేదో, వాటిలో ఎన్ని పిల్లలై, మళ్లీ అవి గుడ్లు పెట్టి, మళ్లీ అవి పిల్లలై పెరిగి, గుడ్లు పెట్టేవో, అదంతా లెక్క చూసి రెండు వందలయాభై రూపాయలయిందన్నాను. ఇదుగో లెక్క. మీరు కూడా చూసి ఇందులో తభావతు ఏమైనా ఉందేమో చెప్పండి. అతని సొమ్ము అన్యాయంగా నేనెందుకు తింటాను ?" అన్నాడు.

మునసబు ముక్కు, మూలిగి లెక్కంతా పైనుంచి కిందికి చూసి, "ఏం పేరయ్యా, లెక్కలో తప్పేమీ లేదే ?" అన్నాడు.

"నేనప్పుడే చెప్పాను. పేరయ్యకు నా మాటలు నమ్మకంలేక మీదాకా తీసుకు వచ్చాడు. చదువురానివాడు కాదూ, పాపం, లెక్కాడొక్కా తెలీదు," అన్నాడు కోటయ్య.

పేరయ్య హతాశుడైపోయాడు. అతను మునసబుగారిదగ్గిర సెలవు తీసుకుని దిగులుగా ఇంటికి పోతూండగా కరణంగారు ఎదురుపడి, "ఏం పేరయ్యా! చాలా విచారంగా ఉన్నావు; ఏం జరిగిందేం?" అన్నాడు. పేరయ్య కరణంతో జరిగిన సంగతంతా చెప్పాడు.

"మునసబుకూడా నిన్ను ముంచాడూ ? నే చెప్పినట్టు చేస్తావా ? కోటయ్య దగ్గిరికి



వెళ్ళి రేపు రచ్చబండదగ్గిర ఈ విషయం పరిష్కారం చేసేటందుకు ఒప్పుకోమను. నీ తరఫున నేను సాక్ష్యం చెబుతానని ఆయనతో చెప్పు," అన్నాడు కరణం. పేరయ్య కోటయ్యదగ్గిరికి వెళ్లి ఆమాటే అన్నాడు.

"మళ్లీ రచ్చబండ తీర్పేమిటి? మునసబుగారు చెప్పారుగా ?" అన్నాడు కోటయ్య.

"నాకు మీ లెక్క అర్థంకాలేదు, మునసబుగారి లెక్క అర్థం కాలేదు. రచ్చబండ దగ్గిర నలుగురూ ఏం చెబితే అలా చేస్తాను. కరణంగారు నావేపు సాక్ష్యం చెబుతామన్నారు. కరణంగారంటే మీకు భయం లేదుగా ?" అన్నాడు పేరయ్య.

"నాకేం భయం ?" అంటూ కోటయ్య రచ్చబండ తీర్పుకు సమ్మతించాడు.

మర్నాడు సాయంకాలం రచ్చబండ దగ్గిర అందరూ కూడారు. కాని కరణంగారి జాడలేదు. కరణంకూడా తనను మోసం చేశాడని పేరయ్య అనుమానించసాగాడు. అందరూ పేరయ్యను చూసి నవ్వుతూండగా చీకటిపడే వేళకు కరణంగారు వచ్చారు.

"నేను రావటం కాస్త ఆలస్యమైనట్టుంది. మరేంలేదు, కూలివాళ్లు ఇవాళ నారుమడి పోసి తీరాలంటే ఒక పందుం విత్తనాలు మంగలాల్లో అప్పటికప్పుడు వేయించవలిసి వచ్చింది. ఆ పని పూర్తి చేసి వస్తున్నా," అన్నాడు కరణం.

"నారుమడి చల్లే విత్తనాలు వేయించటమేమిటి, కరణంగారూ? వేయించిన విత్తనాలు మొలకెత్తుతాయా ?" అన్నాడు మునసబు వెటకారంగా.

"పేరయ్య తిన్న కోడి పిల్లల్ని పెట్టగాలేంది వేయించిన విత్తనాలు మొలకెత్తవా అని అనుకున్నాను !" అన్నాడు కరణం.

అందరూ గొల్లున నవ్వారు. మునసబు చీకట్లో జారుకున్నాడు. కోటయ్య పేరయ్యను కోడి ఖరీదు మళ్లీ అడిగిన పాపాన పోలేదు.



# తమాషాలు

1. గోపీ వయస్సెంత ? మరో మూడేళ్లకు గోపీ వయస్సు ఎంత ఉంటుందో దాన్ని మూడు పెట్టి హెచ్చించి, మూడేళ్ళక్రితం అతని వయస్సునుకూడా అలాగే మూడు పెట్టి హెచ్చించినట్టయితే రెండు సంఖ్యలకూ గల తేడా ఇప్పటి గోపీ వయస్సు! ఇప్పుడు చెప్పండి : గోపీ వయస్సెంత ?

2. ఒక తండ్రీ కొడుకూ ఉన్నారు. ఇవాళ తండ్రి వయసు కొడుకు వయసుకు రెట్టింపు. కాని 18 ఏళ్లక్రితం తండ్రివయసు కొడుకు వయసుకు మూడింతలుండేది. వారి ఇప్పటి వయసులెంత ?

3. ఒక ధనికుడికీ అతని మిత్రుడికీ డబ్బు విషయం చర్చవచ్చింది.

మిత్రుడు ధనికుడితో ఇలా అన్నాడు : "నేను 30 రోజులపాటు ప్రతి రోజూ లక్ష రూపాయలు తెచ్చి నీకిస్తాను. నువు నాకు మొదటి రోజు ఒక నయా పైసా ఇయ్యి. రెండవనాడు రెండు నయా పైసలూ, మూడవనాడు నాలుగు నయా పైసలూ చొప్పున రెట్టిస్తూ ఇయ్యి!" అన్నాడు.

ధనికుడు నివ్వెరపోయి, "నష్టపోతావు సుమా !" అన్నాడు.

మిత్రుడు జంకక, "నష్టపోతే పోయాను. ఈ యేర్పాటుకు నువు సమ్మతిస్తావా ?" అన్నాడు. ధనికుడు సరేనన్నాడు.

ఆ రోజు లగాయతు మిత్రుడు ధనికుడికి రోజూ ఒక లక్ష రూపాయల మూట తెచ్చి ఇచ్చాడు. దానికి ప్రతిఫలంగా అతను మొదటి రోజు ఒక నయా పైసా, రెండో రోజు రెండు పైసలూ, మూడో రోజు నాలుగు పైసలూ, అయిదో రోజు ఎనిమిది పైసలూ, ఇలా తీసుకుంటూ పోసాగాడు. అయిదు రోజులూ అతను తీసుకున్నదంతా కలిపినా పూర్తిగా రూపాయి కాలేదు. అప్పటికి అతను ధనికుడికి అయిదు లక్షల రూపాయ లిచ్చిఉన్నాడు ! 30 రోజులూ గడిచాక ఎవరు నష్టపోయారు ? ఎంత ?

[ సమాధానాలు పై సంచికలో ]



# అరణ్యవాసం

పూర్వం జయసింహుడు కాశ్మీరదేశానికి రాజుగా ఉండేవాడు. ఆయన తమ్ముడైన శక్తిసింహుడు అన్నపై కుట్ర చేసి ఆయనను అరణ్యవాసానికి పంపి కాశ్మీరదేశానికి తానే రాజ్యాభిషేకం చేసుకున్నాడు. కాని జయసింహుడు ప్రజల మన్ననలను అందుకున్న రాజు కావటంచేత, ఆయన కింద ఉండే సామంతులలో కొందరు తమ పదవులకు కూడా స్వస్తి చెప్పి, జయసింహుణ్ణి కొలవగలందులకు ఆయనతోబాటు అరణ్యవాసం వెళ్లారు. అందుచేత జయసింహుడు అరణ్యంలో ఉన్నప్పటికీ ఆయనవెంట కొంత పరివారం ఉండనే ఉన్నది.

జయసింహుడికి లీలావతి అని ఒక కుమార్తె ఉన్నది. అలాగే శక్తిసింహుడికి కూడా మాలతి అని ఒక కుమార్తె ఉన్నది. వారిద్దరూ ఒకే యీడువాళ్లు కావటంచేత, తన కుమార్తెకు తోడుగా ఉంటుందనే ఉద్దేశంతో శక్తిసింహుడు లీలావతిని అడవులకు వెళ్లగొట్టలేదు. తమ తండ్రులు గర్భశత్రువులయినప్పటికీ లీలావతీ మాలతులు ఎంతో అన్యోన్యంగా ఉంటూ ఒకరినొకరు ప్రాణంకంటె ఎక్కువగా చూసుకునేవారు. తన తండ్రి అరణ్యవాసం తలుచుకుని లీలావతి విచారపడినప్పుడల్లా మాలతి ఆమె విచారాన్ని పోగొట్టటానికి శాయశక్తులా ప్రయత్నించేది.

ఇలా ఉండగా శక్తిసింహుడి ఆస్థానంలో ఒకనాడు మల్లయుద్ధం ఏర్పాటయింది. దానిని చూడటానికి లీలావతీ మాలతీకూడా వెళ్లారు. ఆ రోజు యుద్ధం చేసే మల్లులలో ఒకడు శక్తిసింహుడి ఆస్థాన మల్లుడు. వాడు అపరభీముడిలాటివాడు. వాడి చేతిలో ఎందరో మల్లులు అదివరకు చచ్చిఉన్నారు. ఈ మల్లుడితో ఇప్పుడు పోట్లాడటానికి వచ్చినవాడు ఒక సామాన్య యువకుడిలాగా

ఆర్. కోదండరామయ్య



కనబడ్డాడు. ఆ యువకుణ్ణి చూడగానే శక్తి సింహుడికి అతడిమీద జాలికలిగింది. ఆయన, "మన మల్లుడు ఈ కుర్రవాణ్ణి ఒక్క క్షణంలో చంపేస్తాడు. ఇతన్ని పిలిచి యుద్ధం మానమని సలహా ఇవ్వండి," అని తన కూతుసు మాలతితోనూ, లీలావతి తోనూ అన్నాడు.

ఆ యువకుడి పేరు మకరాంకుడు. భటులు అతన్ని రాజకుమార్తెలున్న చోటికి తీసుకువచ్చారు. అతని లేత వయసూ, చక్కదనమూ చూసి రాజకుమార్తెలకు మరింత జాలి కలిగింది. "మా మల్లుడు నీకన్న ఒడ్డూ పొడుగూ ఉన్నవాడు. మల్ల యుద్ధంలో చాలా అనుభవం ఉన్నవాడు. నీకంటె బలశాలులను ఎందరినో వాడు అవలీలగా చంపేశాడు. అందుచేత నువు ఈ ప్రయత్నం మానుకో!" అని వారు మకరాంకుడికి హితవు చెప్పారు.

మాలతికన్నకూడా లీలావతి అతనిని ఎక్కువగా ప్రాధేయపడింది. అయినా మకరాంకుడు వారి మాట వినలేదు. "నా క్షేమం కోరి మీరీ సలహా ఇచ్చినందుకు చాలా కృతజ్ఞుణ్ణి. కాని ఈ యుద్ధంలో చావటానికైనా నేను సిద్ధంగానే ఉన్నాను. ఎందుచేతనంటే నాకోసం ఏడిచే అప్పులూ మిత్రులూ ఎవరూ లేరు!" అన్నాడతను.





తరవాత మల్లయుద్ధం ఆరంభమయింది. మకరాంకుడు బలంలో తక్కువైనా యుక్తిలో తక్కువ కాడు. కొంతసేపయాక అతను అంత లావు మల్లుణ్ణీ ఓడించి అందరికీ ఆశ్చర్యం కలిగించాడు.

శక్తిసింహుడు అతనిని పిలిపించి, "నాయనా, నీ పేరేమిటి? నువు ఎవరి వాడవు?" అని అప్యాయంగా అడిగాడు.

"మహారాజా, నా పేరు మకరాంకుడు. మా తండ్రిగారు గోపాలదేవుడు!" అన్నాడు మకరాంకుడు.

గోపాలదేవుడి పేరు వినగానే శక్తిసింహుడి ముఖం ముడుచుకుపోయింది. ఎందుచేత నంటే, గోపాలదేవుడు కొంతకాలం క్రితం చనిపోయినప్పటికీ, బతికిఉండగా జయ సింహుడి ఆప్తులలో ఒకడు. జయసింహుడికి ఇష్టులైనవారి పేరు వింటేనే శక్తిసింహుడు సహించలేడు. "నువు మరెవరి కొడుకువైనా నేను ఎంతో సంతోషించి ఉందును!" అంటూ శక్తిసింహుడు తన ఆసనంనుంచి లేచి వెళ్ళిపోయాడు.

ఆ యువకుడు తన తండ్రి మిత్రుడికి కొడుకైనందుకు లీలావతి ఎంతో సంతో షించింది. మల్లయుద్ధంలో అంత ప్రజ్ఞ చూపినప్పటికీ రాజు తనపట్ల అనాదరంతో ప్రవర్తించినందుకు మకరాంకుడు చిన్న బుచ్చుకోపటం రాజకుమార్తెలు గమ నించారు. వారు వెళ్ళిపోతూ మకరాంకుడి దగ్గిర ఆగి అతన్ని ప్రశంసించారు. తరవాత లీలావతి తన మెడలో ఉన్న చంద్రహారం తీసి అతని కిస్తూ, "నా జ్ఞాపకార్థం దీన్ని మీరు ధరించండి. ఇంతకన్న ఇవ్వటానికి నావద్ద ఏమీ లేదు, ఉంటే ఎంతయినా ఇచ్చి ఉందును!" అన్నది.

తరవాతకూడా లీలావతి తరుచు మక రాంకుణ్ణి గురించి మాట్లాడుతూ ఉండేటం చూసి మాలతి కొంటెగా, "అక్కా, అకుర్ర వాణ్ణి నువు ప్రేమించినట్టున్నావే?" అన్నది.



"అతని తండ్రీ నా తండ్రీ ఆప్తస్నేహితు లైనప్పుడు నాకతను ఆప్తస్నేహితుడిలాటి వాడుకాడా?" అని లీలావతి తనను తాను సమర్థించుకున్నది.

శక్తిసింహుడికి మకరాంకుడిపై కలిగిన చిరాకు త్వరలోనే లీలావతివైపు మళ్ళింది. ప్రజలకు జయసింహుడిపై అభిమానం ఏమీ తగ్గలేదు. వాళ్ళు, మాలతిని మెచ్చు కున్నదానికన్న లీలావతిని ఎక్కువ మెచ్చు కుంటున్నారు. లీలావతిని చూసినప్పుడల్లా వారికి అడవులు పట్టిపోయిన జయసింహుడు జ్ఞాపకం వస్తున్నాడు.

ఈ విషయాలు గమనించి శక్తిసింహు డొకనాడు అకస్మాత్తుగా లీలావతితో, "నీకిక్కడ చోటు లేదు. నువుకూడా మీ నాన్నతోబాటు అరణ్యంలో వెళ్ళి ఉండు! నీవిక్కడ వుండటం నాకేమాత్రం మేలు కలిగించదు," అన్నాడు కోపంగా.

"అదేమిటి, నాన్నా? లీలావతీ నేనూ ఇన్నాళ్ళూ రెండు శరీరాలూ ఒకేప్రాణమూ లాగా ఉన్నాం. ఇప్పుడామెను అడవులకు పంపితే నేను క్షణం గడపలేను. మాకిద్ద రికీ స్నేహం ఏర్పడక మునుపే ఆమెను పంపేసి ఉంటే ఎలా ఉండేదో! కాని ఇంత కాలం గడిచాక మమ్మల్ని హఠాత్తుగా వేరు చెయ్యటం అన్యాయం!" అని మాలతి తండ్రితో అన్నది.

"నువు వట్టి వెర్రిబాగులదానివి! ఆ లీలావతి పట్టి ముచ్చు! అది అమాయికపు ముఖం పెట్టి, నోట మాట లేకుండా ఉండటం చూసి అందరూ దాన్నే మెచ్చుకుంటు న్నారు; నిన్ను తలచేవారు లేరు. నీ హోదా ఏమిటి, దాని హోదా ఏమిటి? అది వెళ్ళి పోయిన మరుక్షణం చూడు, ప్రజలు నీకెలా బ్రహ్మరథం పడతారో!" అన్నాడు శక్తి సింహుడు.

తన తండ్రి మనసు మార్చుకోడని రూఢి కాగానే మాలతికూడా ఎవరికీ తెలియకుండా



లీలావతి వెంట అడవికి వెళ్ళిపోయే ప్రయత్నం చేసింది. లీలావతి ఆమెను వారించలేకపోయింది.

"మనం మామూలు దుస్తులతో వెళ్ళటం చాలా అపాయకరం. మామూలు కుటుంబాల స్త్రీల దుస్తులు ధరించి వెళితే మనని ఎవరూ పట్టించుకోరు," అన్నది మాలతి.

"ఇద్దరమూ ఆడవాళ్ళలాగా వెళ్ళేకన్న ఒకరు మగదుస్తులు ధరించటం మరింత క్షేమం. నేను నీకన్న పెద్దగా కనిపిస్తాను గనక నేను మగవేషం వేసుకుంటాను. అన్నాచెల్లెలూలాగా మనం బయలుదేరి పోదాం!" అన్నది లీలావతి.

లీలావతి తన పేరు పుష్కరుడుగా మార్చుకున్నది. మాలతి లక్ష్మి అని పేరు పెట్టుకున్నది. వారు వీలయినంత సొమ్మూ, నగలూ, తమ వెలగల దుస్తులూ వెంట తీసుకుని, సామాన్య కుటుంబీకులు ధరించే ముతక దుస్తులతో అర్ధరాత్రి ప్రయాణమై అరణ్యంకేసి వెళ్ళారు. అరణ్యవాసం చేస్తున్న జయసింహుణ్ణి చేరుకుని అక్కడే ఉండిపోవాలని వారి ఉద్దేశం.

వెంట డబ్బు తెచ్చుకున్నారు గనక వారికి దారిపొడుగునా అన్ని సౌకర్యాలూ లభించాయి. కాని అరణ్యం ప్రవేశించాక వారు నానాబాధలూ పడసాగారు. అరణ్యం



లోకి ఎంత దూరం వెళ్ళినా జయసింహుడి జాడ లేదు. దారి పొడుగునా అడవిజంతువుల భయం. ఇద్దరికీ సరయిన తిండి లేదు. రాత్రివేళ తల దాచుకునేటందుకు మంచి చోటులేదు.

మాలతి ఒకచోట కూలబడి, "ఆకలికి శోషవస్తున్నది. ఇక ఒక్క అడుగుకూడా నడవలేను!" అన్నది. ఇద్దరూ కంట నీరు కార్చుతూ ఏమి చెయ్యాలో తోచకుండా ఉన్న స్థితిలో దేవుడల్లే అటుగా ఒక కాపు కుర్రాడు వచ్చాడు.

"బాబూ, ఈమె నా చెల్లెలు, తిండిలేక శోషపడి ఉన్నది. మాకు ఇంత తిండీ విశ్రాంతీ దొరికే చోటుంటే చూపి పుణ్యం కట్టుకో!" అన్నది మగవేషంలో ఉన్న లీలావతి ఆ కాపుతో.

"అయ్యా, దగ్గిరలోనే మా యజమాని అయిన గొర్రెలకాపరి గుడిసె ఉన్నది. అక్కడికి రండి. ఇవాళో రేపో మా యజమాని ఆ గుడిసెను ఎవరికైనా అమ్మేసి అరణ్యంనుంచి వెళ్ళిపోబోతున్నాడు. అంత దాకా మీరు ఆ గుడిసెలో తల దాచుకోవచ్చు!" అన్నాడు కాపుకుర్రాడు.

రాజకుమార్తెలకు ఇదీ ఒక మేలే అయింది. వారు గొర్రెలకాపరి గుడిసెకు వెళ్లి ఆకలిబాధ తీర్చుకుని, ఆ గుడిసెను





తామే కొని అందులో నివసించసాగారు. గుడిసెలో కొన్ని వారాలకు సరిపడే ఆహార పదార్థాలున్నాయి. వాటిని తింటూ వారు జయసింహుడి ఆచోకీతెలుసుకునే ప్రయత్నం మీద ఉన్నారు.

రోజులు గడుస్తున్నాయి. వారికి జయసింహుడి జాడ తెలియలేదు గాని, అరణ్యంలో ఒక ప్రాంతంలో చెట్లపైన ఎవరో "లీలావతి" అన్న పేరు చెక్కి ఉండటం మాత్రం కనిపించింది. ఇది మకరాంకుడి పనే అయిఉంటుందనీ, ఏకారణం చేతనో అతనుకూడా ఈ మహారణ్యంలో ఉంటున్నాడనీ లీలావతి ఊహించింది.

ఆమె ఊహ నిజమే. మకరాంకుడు కూడా పరిస్థితుల ప్రోద్బలంచేత అరణ్యవాసం చెయ్యవలిసివచ్చింది.

మకరాంకుడు గోపాలదేవుడి చిన్న కుమారుడు. తండ్రి పోయేనాటికి అతను చాలా చిన్నవాడు. అందుచేత గోపాలదేవుడు చనిపోయే ముందు మకరాంకుణ్ణి తన పెద్ద కొడుకైన శశాంకుడికి వప్పగిస్తూ, "నాయనా, వీడి భారం నీదే. వీడికి తగిన విద్య నేర్పించి, పెద్దచేసి, ప్రయోజకుణ్ణి చెయ్యి," అన్నాడు.

కాని శశాంకుడు తన తమ్ముడిపట్ల చాలా దుర్మార్గంగా ప్రవర్తించాడు. మకరాంకుడికి చదువు సంధ్యలు లేవు. అయినా అతను అచ్చు తండ్రిలాటివాడు కావటంచేత ఎంతో వినయవిధేయతలు గలిగి చదువుకున్నవారి కన్నకూడా ప్రాజ్ఞుడులాగా ప్రవర్తించేవాడు. అతని హుందాతనం చూసి శశాంకుడికి కన్ను కుట్టింది. అతన్ని ఎలాగైనా నాశనం చెయ్యాలనే ఉద్దేశంతో శశాంకుడు కొంత మంది అనుచరులను ప్రేరేపించి వారిద్వారా మకరాంకుడు మల్లయుద్ధం చేసేలాగు ప్రోత్సహించాడు. తన అన్నకు తన చావు కావాలని తెలిసి మకరాంకుడు ప్రాణం మీదా బ్రతుకుమీదా విరక్తిచెంది మల్ల యుద్ధానికి సిద్ధపడ్డాడు.



అయితే ఈ మల్లయుద్ధంలో మక రాంకుడు గెలవటంతో అందరి అంచ నాలూ తారుమారయాయి. తన తమ్ముడు విజయుడై తిరిగి రావటం చూసి శశాంకుడు మకరాంకుడి పడకగదికి ఒక రాత్రివేళ నిప్పు పెట్టే ఆలోచన చేశాడు.

అదృష్టవశాత్తూ ఈ రహస్యయత్నం ఒక ముసలి సేవకుడికి తెలియవచ్చింది. వాడు మకరాంకుడితో జరగబోయే దురంతం గురించి చెప్పి, ఎవరికీ తెలియకుండా అతన్ని తనవెంట అరణ్యానికి తీసుకుపోయాడు. వాళ్లుకూడా అరణ్యం ప్రవేశించాక, తిండికి చాలా ఇబ్బంది పడ్డారు. ముసలి సేవకుడు శోషవచ్చి పడిపోయాడు. వాణ్ణి ఒకచోట ఉంచి మకరాంకుడు ముందుకు పోయి జయసింహుడూ, అతని పరివారమూ ఉండే చోటికి చేరుకున్నాడు.

జయసింహుడూ, అయన అనుచరులూ అప్పుడే భోజనాలకు కూచోబోతున్నారు. మకరాంకుడు ఆకలిమీద ఉన్న అవేశంతో కత్తి దూసి, "ఆ అహారం ముట్టుకోకండి! అది నాకు కావాలి. నాకు పెట్టకుండా తిన్న వారిని చంపేస్తాను!" అన్నాడు.

జయసింహుడు సౌమ్యంగా, "ఈ భాగ్యా నికి కత్తి దూయాలా, నాయనా? ఆకలిగా



ఉంటే మాతోబాటు తిను. మేము వేటాడిన ఆహారం బోలెడంత ఉన్నది! నిన్నెవరూ అడ్డగించబోరు!" అన్నాడు.

ఈమాట వినగానే మకరాంకుడు తన మొరటుతనానికి నొచ్చుకుని, "అయ్యా, నా దుడుకుతనాన్ని క్షమించండి. ఈ అరణ్యంలో సౌజన్యానికి తావు ఉంటుందని నేను కలలోకూడా అనుకోలేదు. దానికి తోడు ఆకలి నన్ను పశువులాగా చేసివేసింది! నాకన్నకూడా ఆకలిమీద ఉన్న వృద్ధు డొక డున్నాడు. వాణ్ణికూడా తీసుకువస్తాను. వాడు తిన్నదాకా నేను ఏమీ ముట్టలేను!" అంటూ అతను తన నౌకరు పడిపోయిన చోటికి



పోయి, వాణ్ణి మోసుకుని తీసుకు వచ్చాడు. తరవాత అందరూ భోజనాలు చేశారు.

భోజనాలయాక జయసింహుడు మక రాంకుణ్ణి గురించి అంతా విని, అతను తన ప్రాణస్నేహితుడి కుమారుడనీ, తనలాగే సోదరుడివల్ల అపచారం పొందాడనీ తెలుసు కుని, అతన్ని తనవెంటనే ఉంచుకున్నాడు.

రాజకుమార్తెలు గొర్రెలకాపరి గుడిసె కొన్న కొద్ది రోజులకే మకరాంకుడు అరణ్యా నికి వచ్చాడు. అతను చెట్లమీద చెక్కిన లీలావతి పేరునుబట్టి రాజకుమార్తెలు అతను ఆప్రాంతాల ఎక్కడో ఉంటున్నాడని తెలుసుకున్నారు.

మరికొన్ని రోజుల అనంతరం మగ వేషంలో ఉండి, పుష్కరుడని పేరు పెట్టు కున్న లీలావతి అరణ్యంలో ఒంటరిగా కూర్చుని ఉన్న మకరాంకుణ్ణి చూసి, అతని మెడలో తన చంద్రహారం ఉండటం గమ నించింది. ఇద్దరికీ పరిచయమైనాక మక రాంకుడు ఈ పుష్కరుడిలో తన ప్రియు రాలైన లీలావతి లక్షణాలు కొన్ని ఉండటం కనిపెట్టి ఆశ్చర్యపడ్డాడు. కాని లీలావతి రహస్యం బయటపడకుండా వుండేందుకు పని పెట్టుకుని మొరటుగా, తన వేషానికి తగినట్టు, మాట్లాడుతూ ఉండటంచేత అతను నిజం తెలుసుకోలేకపోయాడు.



"ఎవరో కుర్రవాడు ఇక్కడి చెట్లమీద 'లీలావతి' అని చెక్కి చెట్లన్నిటినీ పాడు చేస్తున్నాడు," అన్నది లీలావతి.

మకరాంకుడు అది తన పనే అని ఒప్పుకుని, "లీలావతిని నేను మరిచిపోలేకుండా ఉన్నాను. ఏం చెయ్యాలో తెలియటం లేదు," అన్నాడు.

"అయితే నువ్వు రోజూ మా గుడిసెకు రా. అక్కడ నేనూ నా చెల్లెలు లక్ష్మి ఉంటున్నాము. నేను లీలావతిగా నటిస్తాను. నీ ప్రేమ అంతా నా ఎదట వెళ్లబోసుకుంటూ ఉండు. అందువల్ల నీకు తృప్తి కలగవచ్చు," అన్నది లీలావతి.

మకరాంకుడు అలాగే చేయసాగాడు. కాని ఇందువల్ల అతనికి ఏమీ సంతృప్తి కలగలేదు, కాని లీలావతి మాత్రం చాలా ఆనందం పొందింది. ఎందుకంటే అతను అనే మాటలన్నీ తనకేనని ఆమె ఎరుగును. మాలతికూడా ఈ నాటకం చూసి చాలా ఆనందించేది.

లీలావతి తండ్రి అయిన జయసింహుడు ఉంటున్న స్థలం రాజకుమార్తెలకు మకరాంకుడి ద్వారా తెలిసింది.

ఒకనాడు లీలావతి తన మారువేషంలోనే ఆయనను చూడబోయింది. ఇద్దరూ మాట్లాడుకున్నారు.





"అబ్బాయీ, నీ తలిదండ్రు లెవరు ?" అని జయసింహుడు అడిగాడు.

"నేను గొప్ప వంశంలోనే పుట్టాను," అని లీలావతి సమాధానం చెప్పింది, కాని ఆమె తనను తాను బయట పెట్టుకోకుండానే ఇంటికి వచ్చేసింది.

ఇంకొకనాడు మకరాంకుడు అడవికుండా గొర్రెలకాపరి గుడిసెకు పోతూండగా దారిలో అతనికి ఒక మనిషి పొదలమధ్య నిద్ర పోతూ కనిపించాడు. ఆ మనిషిమీదికి పాకుతున్న ఒక విషసర్పం మకరాంకుడి అలికిడి విని పొదలలోకి పారిపోయింది. దానికేసి చూస్తూండగా మకరాంకుడికి పొదలమధ్య ఒక ఆడసింహం కనబడింది. అది పొదలలో పొంచిఉండి పడుకునిఉన్న మనిషికేసి తదేకదృష్టితో చూస్తున్నది. ఆ మనిషి కదిలితే మీద పడి చంపుదామని దాని ఉద్దేశం; ఎందుకంటే సింహాలు కదలిక లేని ప్రాణులనూ, శవాలనూ ఎంత ఆకలిగావున్నా ముట్టవు.

వెంట్రుకవాసిలో పాముగండం తప్పి సింహంవాత పడటానికి సిద్ధంగా ఉన్న ఆ మనిషి ఎవరా అని చూసేసరికి ఆ పడుకుని ఉన్నది తన అన్న అయిన శశాంకుడని మకరాంకుడికి తెలిసివచ్చింది. "నన్ను గదిలో పెట్టి కాల్చిచంపాలనుకున్న ఈ దుర్మార్గుడు సింహంవాత పడనీ!" అని మకరాంకుడు ఒక్క క్షణంపాటు అనుకున్నాడు. గాని మరుక్షణమే అతనికి తన అన్న ప్రాణం కాపాడాలనిపించింది. అతను కత్తి దూసి సింహంపై బడి దాన్ని చంపేశాడు. కాని ఈ లోపుగా సింహం తన పంజా విప్పి మకరాంకుడి చేతిని బలంగా పీకింది.

మకరాంకుడు సింహాన్ని చంపే సందడికి శశాంకుడు నిద్ర లేచాడు, తన ప్రాణం కాపాడటానికి తన తమ్ముడు చేస్తున్న సాహసం గుర్తించి తనను చూసి తానే ఎంతో

సిగ్గుపడ్డాడు. సింహం చచ్చాక అతను తమ్ముణ్ణి కౌగలించుకుని, "నేను నీకు ద్రోహం తలపెట్టినా, నువు నా ప్రాణం కాపాడావు. నా దుర్మార్గాన్ని క్షమించు, తమ్ముడూ!" అన్నాడు.

మకరాంకుడు చాలా రక్తం పోగొట్టుకుని నీరసించి ఉన్నాడు. అతను శశాంకుడితో, "అన్నా, ఈ దారినే పోతే ఒక గుడిసె వస్తుంది. అక్కడ పుష్కరుడని ఒక కాపు కుర్రవాడున్నాడు. అతను నా మిత్రుడు. సరదాకు అతను నా ప్రియురాలైన లీలావతిగా అభినయిస్తూంటాడు. అతనితో నా సంగతి చెప్పాలి!" అన్నాడు.

శశాంకుడు బయలుదేరి గుడిసెకు వెళ్ళి పుష్కరుడితోనూ, లక్ష్మితోనూ మకరాంకుడికి గాయం తగిలిన వృత్తాంతమంతా చెప్పాడు. తాను మకరాంకుడికి అన్ననీ, ఒకప్పుడు భ్రాతృద్రోహం తలపెట్టాననీ, అందుకే మకరాంకుడు అరణ్యవాసం చేస్తున్నాడనీ, తనకిప్పుడు బుద్ధి వచ్చి హృదయ పరివర్తన జరిగిందనీకూడా శశాంకుడు వారితో అన్నాడు.

శశాంకుడి పశ్చాత్తాపం చూసి మాలతి వెన్నలాగా కరిగిపోయింది. ఆమె అతని బాధను అర్థం చేసుకుని సానుభూతి



చూపింది. ఆ క్షణంలోనే వారిద్దరి మధ్యా ప్రేమ ఏర్పడింది.

ఈ సందర్భంలోనే ఇంకొక చిత్రంకూడా జరిగింది. మకరాంకుణ్ణి సింహం పీకిందని వినగానే లీలావతికి స్పృహతప్పిపోయింది. తిరిగి స్పృహ తెలిసినాక ఆమె తన దౌర్బల్యాన్ని కప్పిపుచ్చుకోవటానికి, "మకరాంకుడి ప్రేయసిలాగా అభినయించే అలవాటు చొప్పున, ఈ వార్త వినగానే మూర్ఛ వచ్చినట్టు అభినయించాను!" అని ఆమె శశాంకుడితో అన్నది. కాని పాలిపోయిన ఆ పుష్కరుడి ముఖం చూస్తే ఆ మూర్ఛ నటనగా శశాంకుడికి కనిపించలేదు.



అతను తన తమ్ముడున్న చోటికి తిరిగి పోయి గుడిసెలో జరిగిన సంగతులన్నీ, పుష్కరుడు మూర్ఛపోవటంతోసహా, చెప్పి, "ఆ కాపుపిల్ల లక్ష్మి ఉన్నది చూడూ, ఆమెను నేను ఎంత ప్రేమిస్తున్నానో చెప్ప లేను. నేనామెను పెళ్ళాడి ఆ గుడిసెలోనే ఉండిపోవటానికి నిశ్చయించాను. నువు మన ఊరు వెళ్ళి మన ఆస్తియావత్తూ స్వాధీనపరుచుకుని అనుభవించు. నా కవి ఏవీ అవసరం లేదు," అన్నాడు.

"అయితే రేపే మీ పెళ్లి జరిగేటట్టు చూడు. అడుగో పుష్కరుడు వస్తున్నాడు. ఆ లక్ష్మి ఒంటరిగా ఉంటుంది. నువు వెళ్లి ఆమెను పెళ్లికి ఒప్పించు. జయసింహుడి సమక్షానే పెళ్ళి జరుపుదాం!" అన్నాడు మకరాంకుడు.

శశాంకుడు వెళ్ళిపోయాక మకరాంకుడు లీలావతితో తన అన్న లక్ష్మిని ప్రేమించి పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్న విషయం చెప్పి, "ఈ పెళ్లితోబాటు నాకూ లీలావతికీ పెళ్లి అయితే ఎంత బాగుండును !" అన్నాడు.

"నీకు నిజంగా లీలావతిపైన అంత ప్రేమ ఉంటే నేను రేపు ఉదయానికల్లా అమె ఇక్కడ ఉండేటట్టు చేయగలను. అంతే కాదు, ఆమె నిన్ను పెళ్ళాడటానికి ఒప్పుకునేటట్టు చేస్తాను. నాకు కొంచెంగా మంత్రవిద్య తెలుసు," అన్నది లీలావతి.

ఒకవంక ఆశా, మరొక వంక అనుమానమూ మకరాంకుణ్ణి బాధించాయి. "ఇది పరిహాసాలకు సమయం కాదు. నిజంచెప్పు!" అన్నాడతను.

"ఇందులో పరిహాసం ఏమీ లేదు. నేను అచ్చగా నిజమే చెబుతున్నాను. నువు మంచి దుస్తులు వేసుకుని పెళ్లికొడుకువు కా. కావలిస్తే జయసింహుడు మొదలైనవారికి కూడా చెప్పెయ్యి. రేపు ఉదయం లీలావతి ఇక్కడ ఉండేటట్లు చూసే పూచీ నాదీ !" అన్నది లీలావతి.

మర్నాడు ఉదయం జయసింహుడి సమక్షాన రెండు వివాహాలూ జరగటానికి ఏర్పాటయింది. లక్ష్మి, శశాంకుడూ, మకరాంకుడూ, ఆయన ఉండే చోటికి వెళ్ళారు. జయసింహుడి పరివారం పెళ్ళికూతురు ఒక్కతే ఉండటం చూసి ఆశ్చర్యపడ్డారు. పుష్కరుడు లీలావతిని తీసుకువస్తున్నాడని మకరాంకుడు చెప్పాడు. రాబోయే పెళ్లికూతురు తన కుమార్తే అని విని జయసింహుడికి మరింత ఆశ్చర్యమయింది.

"పుష్కరుడు నిన్ను వేళాకోళం చెయ్యటానికి అలా అని ఉంటాడు. నా కుమార్తెను తీసుకురావటం వాడివల్ల అయేపని కాదు," అన్నాడు జయసింహుడు మకరాంకుడితో.

ఇంతలో పుష్కరుడు అక్కడికి వచ్చి జయసింహుడితో, "నేను మీ కుమార్తెను ఇక్కడికి తీసుకువచ్చే పక్షంలో ఆమెను ఈ మకరాంకుడు పెళ్లాడటానికి మీరు అనుమతి ఇస్తారా?" అని అడిగాడు.

"తప్పక అనుమతిస్తాను. ఉంటే ఒక రాజ్యం కట్నంగాకూడా ఇద్దును!" అన్నాడు జయసింహుడు.

"ఆమెను పెళ్లాడటం నీకు సమ్మతమేగదా?" అన్నాడు పుష్కరుడు మకరాంకుడితో.



"అనేక రాజ్యాలకు చక్రవర్తిని అయినప్పటికీ ఆమెను మనస్ఫూర్తిగా పెళ్లాడతాను!" అన్నాడు మకరాంకుడు.

తరవాత పుష్కరుడూ లక్ష్మి కలిసి తమ గుడిసెకు వెళ్లారు. లీలావతి తన మగవేషం విప్పేసింది. ఇద్దరూ తాము తెచ్చుకున్న తమ అసలు దుస్తులనూ, నగలనూ ధరించి రాజకుమార్తెలలాగా తయారయారు. వారు జయసింహుడున్న చోటికి తిరిగివచ్చారు. లీలావతి తన తండ్రికి ప్రణామం చేసి తనను దీవించమని కోరింది. ఆమె తన తండ్రికి తన అజ్ఞాతవాస కథ యావత్తూ చెప్పేసింది.

తరవాత లీలావతిని మకరాంకుడూ, మాలతిని శశాంకుడూ పెళ్లిచేసుకున్నారు. ఈ పెళ్లిళ్లు నగరంలో ఎంతో వైభవంగా జరగవలసినవైనప్పటికీ ఈ మహారణ్యం మధ్యకూడా ఆనందానికి ఏమీ లోటులేక పోయింది. పెళ్లిళ్లు అయాక అందరూ విందుభోజనాలు చేస్తూ ఉండగా శక్తి సింహుడు కొందరు భటులను వెంటబెట్టు కుని అక్కడికి వచ్చాడు.

తన కుమార్తె మాలతి మాయమైనప్పటి నుంచీ శక్తిసింహుడికి చాలా ఆగ్రహంగా ఉన్నది. దిక్కులేక అడవులు పట్టిపోయిన తన అన్నదగ్గిరికి తన కుమార్తె ఎందుకు వెళ్ళాలని ఆయనకు కోపం వచ్చింది. జయ సింహుణ్ణి, ఆయన పరివారాన్నీ నాశనంచేసే ఉద్దేశంతో శక్తిసింహుడు కొంతబలాన్ని వెంటబెట్టుకుని వచ్చాడు.

అయితే కొత్తపెళ్ళికొడుకులనూ, పెళ్ళి కూతుళ్ళనూ, విందు చేసుకుంటున్న వారినీ చూడగానే శక్తిసింహుడికి జ్ఞానోదయ మయింది. అరణ్య మధ్యంలోకూడా ఆనం దానికి కొరత ఉండదనీ, కిరీటం ఉంటేనే రాజు కానవసరం లేదనీ, తన అన్న అయిన జయసింహుడు ఎక్కడ ఉన్నా రాజేననీ శక్తిసింహుడు అర్థం చేసుకున్నాడు. అతను అన్న కాళ్ళపై పడి క్షమాపణ వేడి, "జరిగినదేదో జరిగిపోయింది. నువు లేని రాజ్యం అరణ్యంలాగా ఉన్నది, నువు ఉన్న అరణ్యం రాజ్యంలాగా ఉన్నది; అందుచేత నువు తిరిగి వచ్చి నీ రాజ్యాన్ని ఎప్పటిలాగా ఏలుకో!" అన్నాడు.

ఈ మాటలు విని అందరూ హర్షించారు. జయసింహుడి అరణ్యవాసం ముగిసింది. తమరాజ్యాలనుకూడా వదిలిపెట్టి తనను అరణ్యంలోకూడా కొలిచిన సామంతులంద రికీ ఆయన తన ఆదరాన్ని పుష్కలంగా చూపాడు. అందరూ తమతమ రాజ్యాలకు తిరిగి పోయి సుఖంగా కాలంగడిపారు.






## 15

[ధీరమతి తన ఇంటికి తిరిగివచ్చి తల్లితో అన్ని విషయాలూ చెప్పాడుగాని తన తండ్రి విషయంమాత్రం చెప్పలేదు. అతనివెంట పైలాస్ నుంచి వచ్చిన ఒక జ్ఞాని అతనికి ఆ రోజు అతిథిగా వచ్చాడు. ఆ అతిథి భోజనం చేసినాక రూపధరుడి ఇంట తిష్ఠవేసిన దుర్మార్గులందరూ హాలులో భోజనాలు ప్రారంభించారు. ఆ సమయంలో రూపధరుడు అక్కడికి ముసలి బిచ్చగాడి ఆకారంలో వచ్చి, ధీరమతి ఇచ్చిన ఆహారం తిని, అందరిదగ్గిరా అడుక్కో నారంభించాడు.]

రూపధరుడి ఇంటపడి తింటున్న ఆ దుర్మార్గులకు ఈ ముసలివాణ్ణి చూసి చాలా జాలి కలిగింది. వారు తమకు తోచినది అతని చేతిలో పెట్టారు. "ఈ ముసలి వాడెవడు? వీడు ఎక్కడనుంచి వచ్చాడు?" అని కొందరు ఆశ్చర్యంతో అడిగారు.

అక్కడే ఉన్న మేకలకాపరి కాళుడు, "బాబుల్లారా, ఈ ముసలివాణ్ణి యిక్కడకు వచ్చే దారిలో ఇంతకుముందే నేను చూశాను. మన పందులకాపరి వెంటబెట్టుకు వచ్చాడు," అన్నాడు.

ఈమాట విని దుర్బుద్ధి పందులకాపరి కేసి తిరిగి, "నీ కిదేం పొయ్యేకాలంరా? ఈ నగరంలో తిరుగుబోతులూ, బిచ్చగాళ్లూ తక్కువయారని ఈ ముసలిముండాకొడుకును వెంట తెచ్చావా? మీ యజమాని

గ్రీకు పురాణగాథ





మాట్లాడటం నేర్చుకుంటున్నారు," అని దుర్బుద్ధికేసి తిరిగి, "మనం బలం గల వాళ్లం గనక ఈ ముసలివాణ్ణి బయటికి గెంటమంటావు! అదేనా నీ సలహా? అలా ఎన్నటికీ జరగదు. నేను చెబుతున్నాను. దానం చెయ్యి. కాని నీకు తినటంలో ఉన్న ఆసక్తి పెట్టటంలో లేదు!" అన్నాడు.

"అబ్బో, చాలా పెద్ద ఉపన్యాసం ఇచ్చావే? నేను ఈ ముసలాడి కిచ్చేదే అందరూ ఇస్తే వీడు మళ్లీ ఈ ఇంటి చాయలకు రాడు!" అంటూ దుర్బుద్ధి బల్లకింద తన కాళ్ల అడుగున ఉన్న పీటను వంగి పైకి తీశాడు.

సొత్తు తినేటందుకు బిచ్చగాళ్లు తక్కువయారనా?" అన్నాడు.

"బాబయ్యా, తమరు గొప్పవారైతే కావచ్చు గాని, మా నౌకర్ల విషయంలో మీరు మహా కఠినంగా ఉంటున్నారు. ఎవరైనా బిచ్చగాళ్లను కావాలని వెంట తెస్తారా? కాకపోయినా నాకు తమతో పనేమిటి? నన్ను మా యజమానురాలూ, చిన్న యజమానీ నాలుగు కాలాలపాటు చల్లగా చూడాలి, అంతే!" అన్నాడు పందులకాపరి.

ధీరమతి పందుల కాపరితో, "ఎందుకు నీకీ అనవసర ప్రసంగం? అతని నోరే అంత. అతన్ని చూసి మిగిలినవాళ్లుకూడా పరుషంగా

ఈలోపల రూపధరుడు అందరిదగ్గిరా తలా కాస్త పుచ్చుకుని తన జోలెలో వేసుకుని, దుర్బుద్ధిని సమీపించి, "అయ్యా, ఈ అందరిలోకీ మీరు గొప్పవారులాగా కనిపిస్తున్నారు. అందుచేత అందరికన్నా ఎక్కువగా ఇవ్వాలి. నేనుకూడా ఒకప్పుడు బాగా బతికినవాణ్ణి. నాకింద అనేక వేలమంది కింకరులుండేవాళ్లు. కాని దేవతలు నాపట్ల ఆగ్రహించి, నన్ను సముద్రాలపై దొంగతనాలు చెయ్యటానికి పంపారు. ఈజిప్టులో నా అనుచరులంతా శత్రువుల చేతుల్లో హతమయ్యారు. నేను దిక్కులేని వాణ్ణయిపోయి






ఈ విధంగా ఒంటరిగా దేశాలుపట్టి తిరుగుతున్నాను!" అన్నాడు.

"ఏమిటీ పీడ? తిండికూడా హాయిగా తినటానికి లేకుండా! దూరంగా నిలబడు! బిచ్చగాడివై ఉండి నీకెంత కావరం! నిన్ను మళ్లీ ఈజిప్టు పంపగలను జాగ్రత్త! వాళ్లంతా ఇవ్వకేం జేస్తారూ? వాళ్ల సొత్తు కాదుగా?" అన్నాడు దుర్బుద్ధి.

"అయ్యా, తమరు చూడటానికి గొప్పగా ఉన్నా బుద్ధిమాత్రం చాలా చిన్నదిలాగుంది. మీ సొత్తు కానప్పుడే ఇంత పెట్టలేనివారు మీ సొత్తయితే ఉప్పు నలుసుకూడా విదిలించేట్టు లేరే? ఇక్కడ ఇంత తినటానికి ఉన్నది గదా, ఒక చిన్న రొట్టెముక్క పారెయ్యగూడదా, బాబూ?" అంటూ రూపధరుడు అక్కడినుంచి కదిలాడు.

"ఎంత మాట అన్నావురా?" అంటూ దుర్బుద్ధి తన చేతిలో ఉన్న పీట రూపధరుడిపైన విసిరాడు. అది రూపధరుడి వీపున కుడిభుజంపైన బలంగా తగిలింది.

కాని రూపధరుడు ఆ దెబ్బకు చలించలేదు. అతను తల తిప్పి దుర్బుద్ధికేసి ఒక్కసారి రోషంగా చూసి, వాకిలివద్ద తన స్థానానికి తిరిగి వెళ్లి ఇలా అన్నాడు: "ఈ ఇంటావిడను పెళ్లాడగోరే బాబుల్లారా! నా మాట వినండి. తన సొత్తును సంరక్షించుకునే ప్రయత్నంలో మనిషి దెబ్బతింటే అందులో విశేషం ఏమీలేదు. కాని ఒక మనిషి పొట్టకోసం పాకులాడుతూ దెబ్బ తినటం చాలా ఘోరం. మా బిచ్చగాళ్లను కాపాడే దేవుడెవడైనా ఉంటే ఈ దుర్బుద్ధి పల్లకీ ఎక్కటం అబద్ధమూ పాడె ఎక్కటం మాత్రం నిజమూ అవుతుంది!"

"నోరు మూసుకు కూచుని తింటావా, తిను. లేదా బయటికి నడు! అంతే గాని, ఇలా పేలావంటే నిన్ను అందరమూ కలిసి తాట వొలుస్తాము, జాగ్రత్త!" అన్నాడు దుర్బుద్ధి కోపంగా.



ఆ ముసలి బిచ్చగాడిపట్ల దుర్బుద్ధి అంత క్రూరంగా ప్రవర్తించటం మిగిలినవారికి కూడా అంతగా నచ్చలేదు. "ఆ ముసలి వెధవను కొట్టటమేమిటి?" "ఒకవేళ బిచ్చగాళ్ల దేవుడున్నాడేమో!" "ఒక్కొక్కసారి దేవుళ్లే ఇలాటి రూపంలో వస్తారు!" అని తలా ఒకమాటా అన్నారు.

ఆ మాటల్లో ఏఒక్కటీ దుర్బుద్ధి వినిపించుకో లేదు.

కాని తన తండ్రికి తగిలిన దెబ్బ చూసి ధీరమతికి మండిపోతున్నది. అతను తన దుఃఖాన్నీ, ఆగ్రహాన్నీ బలవంతాన అణచి పెట్టుకున్నాడు.



హాలులో జరిగిన సంగతులు పద్మముఖికీ, ఆమె వెంట ఉన్న పరిచారికలకూ తెలిశాయి. ఆమె పందుల కాపరిని పిలిపించి, "ఆ బిచ్చగాణ్ణి ఒకసారి పిలుచుకు వస్తావా? ఆయన చాలా దేశాలు తిరిగాట్ట, నాభర్త సమాచారం ఏమైనా చెబుతాడేమో! అడిగి చూస్తాను," అన్నది.

పందుల కాపరి రూపధరుడి దగ్గిరికి వెళ్లి, "అమ్మగారు నిన్నొకసారి రమ్మంటున్నారు. మా యజమాని వార్తలు నీకేమైనా తెలిస్తే వింటారట!" అన్నాడు.

"మీ యజమాని వార్తలు నాకు చాలా తెలుసు. కాని అవన్నీ చెప్పేందుకు ఇది సమయం కాదు. పొద్దూకినాక ఎవరూ లేనప్పుడు వస్తానని ఆవిడతో చెప్పు!" అన్నాడు రూపధరుడు.

పందులకాపరి పద్మముఖికి ఈ మాట చెప్పివచ్చి ధీరమతితో, "చిన్నబాబూ, ఇక నేను వెళ్లి నా పందులను చూసుకోవాలి. ఆ ముసలాణ్ణి కాస్త జాగ్రత్తగా చూసుకో! చూశావుగా దుర్బుద్ధి అతన్ని ఎంత లావు దెబ్బ కొట్టాడో?" అన్నాడు.

"ముసలాడి భయం నీకేమీ వద్దులే. నువు మాత్రం భోజనంచేసి మరీ వెళ్లు!" అన్నాడు ధీరమతి.





పందులకాపరి భోజనంచేసి వెళ్లేసరికి అపరాహ్ణమయింది. అందరూ పాటలలో, నృత్యాలలో మునిగి జల్సా చేస్తున్నారు. ఆ సమయానికి అక్కడికి మరొక బిచ్చగాడు వచ్చాడు. వాడు నగరంలో ఎప్పుడూ అడుక్కుతినేవాడే. వాడు అందరికీ సమాచారాలు చేరవేయుటంచేత వాణ్ణి "దూత" అని పిలిచేవారు.

ఈ దూత లోపలికి వస్తూనే రూపధరుణ్ణి చూసి, "ఏయ్, ముసలాడా! ఎవడవురా నువు? అవతలికి పోతావా, లాగి పారెయ్యమన్నావా?" అని గద్దించాడు.

"నేను నిన్నేమైనా అన్నానా, పెట్టానా? నాజోలి నీకెందుకు? నీమానాన నువు అడుక్కోరాదా? లాగటం మాటవస్తే, ముసలివాణ్ణయినా, నేనే నిన్ను లాగి పారెయ్యవచ్చు," అన్నాడు రూపధరుడు.

"ఏమిరా నీ పొగరూ? లేచి నిలబడు! ఎవరి బలమో తేల్చుకుందాం! ముసలి తొత్తువు నావంటి పడుచువాడిమీదికి కాలు దువ్వుతావా?" అన్నాడు దూత.

ఇద్దరు బిచ్చగాళ్లూ కాట్లకుక్కల్లాగా తయారుకావటం చూసి దుర్బుద్ధికి పరమానందమయింది. "స్నేహితులారా, వీళ్లిద్దరిలో ఎవరు గెలుస్తారో తేల్చుకుందాం. వీళ్ల




పోట్లాట ఇవాళ మనకొక కొత్త వినోదం!" అన్నాడతను.

అందరూ లేచి వచ్చి బిచ్చగాళ్ల చుట్టూ మూగారు. "మీ ఇద్దరిలో ఎవరు గెలిస్తే వాళ్లు రాత్రిదాకా ఇక్కడ ఉండి నిశ్చింతగా కావలిసినంత తినవచ్చు. ఓడిపోయినవాణ్ణి ఇక్కడ ఉండనివ్వం!" అన్నాడు దుర్బుద్ధి.

"అయ్యలారా, అసలే ముసలివాణ్ణి, పోట్లాడవలిసింది పడుచువాడితో. మీలో ఎవరూ నన్ను పక్కదెబ్బ కొట్టనని మాట ఇవ్వండి. అలా ఈ దూతకు మీరు సహాయం చెయ్యకుండా ఉంటే నా శక్తికొద్దీ పోరాడతాను!" అన్నాడు రూపధరుడు.






మధ్యలో అన్యాయం చెయ్యమని అందరూ ప్రమాణాలు చేశారు. తరవాత ధీరమతి రూపధరుడితో, "ఈ ఇంటిపెద్దను నేను. మిగిలినవారిలో కూడా పెద్దలున్నారు. మేమంతా నీకు అన్యాయం జరగకుండా చూస్తాం!" అన్నాడు.

తరవాత రూపధరుడు తన చింకిదుస్తులను కాళ్లమీదా చేతులమీదా ఎగదీసి కట్టాడు. అతని బలమైన తొడలూ, పిక్కలూ జబ్బలూ చూసి అందరూ నిర్ఘాంతపోయారు. "ఇవాళ మన దూతగాడు యమదూతల పాలే! కొరివితో తల గోక్కున్నాడు, వెధవ!" అని వారనుకున్నారు.



ఇక దూత స్థితి వర్ణనాతీతంగా ఉన్నది. వాడు భయంతో వణికిపోతున్నాడు. వాడి బట్టలు ఎగగట్టటానికి నౌకర్లు సహాయపడవలిసి వచ్చింది. రూపధరుడితో పోట్లాడటానికికూడా వాణ్ణి బలవంతాన తొయ్యవలిసి వచ్చింది. ఈ దూతను ఒక్క గట్టి గుద్దుతో యమలోకానికి పంపటమా, లేక చిన్న దెబ్బతో పడగొట్టటమా అని రూపధరుడు వితర్కించుకున్నాడు. ఒక్క దెబ్బతో తాను దూతను చంపేసినట్టయితే ఆ దుర్మార్గులకు తనను గురించి అనుమానం రావచ్చు. అందుచేత చిన్న దెబ్బే కొడదామని రూపధరుడు నిశ్చయించాడు.

ఇద్దరు యోధులూ ఒకరినొకరు ఎదుర్కొగానే దూత రూపధరుడి కుడిభుజాన్ని కొట్టబోయాడు. కాని రూపధరుడు దూత దవడమీద ఒక్క దెబ్బ కొట్టేసరికి, వాడి దవడ ఎముక విరిగింది. వాడు నోట నెత్తురు కక్కుతూ కింద పడిపోయి కాళ్లు గిలగిలా తన్నుకున్నాడు. ప్రేక్షకులు చేతులు పైకెత్తి అల్లరిగా నవ్వారు.

రూపధరుడు దూత కాలు పట్టుకుని జరజరా బయటికి ఈడ్చుకుపోయి వాణ్ణి గోడ నానించి కూచోబెట్టి, వాడి కర్ర వాడి చేతిలో పెట్టి, "కుక్కలూ, పందులూ లోపలికి



రాకుండా చూస్తూండు. బిచ్చగాళ్ల కందరికీ నువే చక్రవర్తిననుకోకు. ఇంకా నయం, ఇవాళ తేలికలో పోయింది!" అన్నాడు. తరవాత అతను తిరిగివచ్చి వాకిలివద్ద తన యథాస్థానంలో కూచున్నాడు.

సాయంకాలం కాగానే పద్మముఖి, ఎన్నడూ రానిది, హాలులోకి దిగి వచ్చింది. ఆమె సౌందర్యం చూసి అందరూ తన్మయత్వం చెందారు. ఆమె తన కుమారుడితో, "ధీరమతీ, అంతకంతకూ నువ్విలా అయి పోతున్నావేమిటి, నాయనా? పరాయివాడు మన పంచన చేరితే అతనిపైన చెయ్యి చేసుకోనిస్తావా? ఆ మనిషికేదైనా ప్రమాదం లాటిది జరిగితే మనకు నలుగురిలో అప్రతిష్ఠ కాదా?" అన్నది.

"నీకు కోపం రావటం సహజమేనమ్మా! వీళ్లంతా నాచుట్టూ మూగి నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నారు. నేనేం చేసేది? ఇంతకూ ఈ వృద్ధుడిపైన చెయ్యిచేసుకున్న దూతకు మంచిశాస్తే అయిందిలే!" అన్నాడు ధీరమతి.

దూరంనుంచి విపులయోధుడనేవాడు, "పద్మముఖీ, నీ అందాన్ని దేశంలో ఉండే జనమంతా చూడగలిగితే అందరూ రేపు మీ ఇంటనే ఉంటారు! అందరూ నిన్ను పెళ్లాడ



గోరతారు! నిజంగా ఈ దేశపు స్త్రీలకు నీవు ఆభిముత్యానివి!" అన్నాడు.

"నా అందమంతా నాభర్త వెళ్లిపోయిన నాడే హరించుకుపోయింది. వెళ్లిపోయేటప్పుడాయన నాతో తాను మరణించిన పక్షంలో మరొకరిని వివాహమాడమని చెప్పినమాట నిజమే. కాని నా స్వయంవరం ఇంత అవమానకరంగా ఉంటుందని ఎన్నడూ అనుకోలేదు. ఇలాటిది ఎక్కడైనా ఉన్నదా? వరులుగా వచ్చేవారు వధువుకు ఆభరణాలూ, పశువులూ కట్నాలుగా తెస్తారు. అంతే గాని ఆమె ఇంట తిష్ఠవేసి ఆమె ఆస్తి యావత్తూ తినెయ్యరు," అన్నది పద్మముఖి.





69



ఆమెకు దుర్బుద్ధి ఈవిధంగా సమాధాన మిచ్చాడు. "నీవన్నమాట నిజమే, పద్మ ముఖి. అందరమూ మాకు తోచిన కట్నాలు తెప్పించి ఇయ్యమంటే ఇస్తాంగాని, మాలో ఒకరిని నువు భర్తగా వరించేదాకా మే మిక్కడినుండి మాత్రం వెళ్లిపోము!"

తరవాత అందరూ తమ మనుషులను పంపించి పద్మముఖికి వెలలేని కట్నాలు తెప్పించి ఇచ్చారు. వాటన్నిటినీ తన దాసీల చేత పట్టించుకుని పద్మముఖి తన గదికి వెళ్లిపోయింది.

చీకటిపడగానే హాలులో మూడు చోట్ల అగ్నిహెూత్రాలు చేశారు. దివిటీలు వెలిగించారు.

చాలాసేపు అందరూ తాగి నానా అల్లరీ చేశారు. విపులయోధుడు రూపధరుడికి ఉద్యోగం ఇస్తానన్నాడు. "అయితే నువు చాలా దొంగవెధవవి! కష్టపడి పనిచేసే బాపతు కాదు!" అన్నాడతను.

"పొలం దున్నటంలోగాని, కొడవలి తీసుకునీ గడ్డి కొయ్యటంలోగాని మనం ఎప్పుడైనా పందెం వేసుకుందాం. ఎవరు ఎక్కువ పనిమంతులో తెలుస్తుంది. నువు వట్టి వదరుబోతువు. ఆ రూపధరుడు తిరిగి వస్తే నీ బతుకు తెలుస్తుంది!" అన్నాడు రూపధరుడు.

విపులయోధుడు ఆగ్రహించి అతనిపై ఒక పీట విసిరాడు. రూపధరుడు తప్పుకోగా అది ఇంకొకడికి తగిలింది. వాడు అరవ సాగాడు. అదిచూసి ఒక్కసారిగా అందరూ కేకలుపెట్టారు.

ధీరమతి అధికారంతో, "ఏమిటీ అల్లరి? మీకు చెడతాగి కైపెక్కి వెర్రివాళ్లలాగా ప్రవర్తిస్తున్నారు. ఇదేమీ బాగాలేదు. తిన్నారు, తాగారు, ఇక వెళ్లి పడుకోండి!" అన్నాడు. అందరూ లేచి వెళ్లిపోయారు. ఆ హాలులో రూపధరుడూ, ధీరమతీ మాత్రమే మిగిలారు.

—(ఇంకా వుంది)





# రాజద్రోహి త్యాగబుద్ధి

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ త్యాగశీలత నిజంగా ప్రశంసనీయమైనది. కాని నీకంటె కూడా గొప్ప త్యాగధనులు, తమ సుఖాన్నీ ప్రాణాలనూ సయితం ధారపోయ సిద్ధపడిన వారున్నారు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకై గుణభూషణుడి విచిత్ర కథ చెబుతాను విను," అంటూ ఈ కింది కథ చెప్పసాగాడు.

పూర్వం కాశీరాజు కొలువులో గుణ భూషణుడనే యువకుడు ఉండేవాడు. అతను మగధదేశపువాడు. మగధలో అతని తండ్రి గొప్ప కోటీశ్వరుడనీ, గుణభూషణుడు తండ్రితో విరోధించి కాశీనగరం వచ్చేసి ఇక్కడ చిన్న పదవిలో ఉన్నాడనీ చెప్పుకునే

**బేతాళ కథలు**



వారు. అతను చాలా మితభాషి, అనవసర ప్రసంగాలుగాని, అడ్డమైనవారితో నల్లా స్నేహాలుగాని చేసేవాడు కాడు, అందుచేత అతని కథ ఏమిటో ఎవరికీ తెలియదు.

కాశీనగరంలో వర్తకం చేసుకుంటూనూ, ఇతర పనులు చేసుకుంటూను కొందరు మగధదేశవాసు లుండేవారు. గుణభూషణుడు వారితో మాత్రమే స్నేహంగా ఉంటూ తరుచు వారి ఇళ్లకు వెళ్లేవాడు.

ఇలా ఉండగా రాజుగారిపై కుట్ర ఒకటి జరుగుతున్నట్టు బయటపడింది. ఆ కుట్రలో అధికంగా మగధదేశవాసులున్నారు. వారందరినీ రాజభటులు పట్టుకుని ఖైదులో ఉంచారు. మిగిలినవారితో బాటు గుణభూషణుడుకూడా బంధించబడ్డాడు. తరవాత విచారణ జరిగింది. రాజద్రోహం తలపెట్టినట్టు రుజువయినవారిని ఉరితీశారు.

గుణభూషణుడికీ, మరి ఇద్దరు ముగ్గురికీ ఈ కుట్రలో భాగం ఉన్నట్టు కొంచెంకూడా సాక్ష్యం లేకపోయింది. అయినా మంత్రిగారు వారిని కొంతకాలం ఖైదులోనే ఉంచటానికి నిర్ణయించాడు. వారు నిజంగా రాజద్రోహం తలపెట్టినవారైతే ఆ విషయం ఎప్పటికైనా బయటపడుతుందని మంత్రిగారి నమ్మకం.

కాశీదేశపు మంత్రి పేరు కైలాసనాథుడు. ఆయన వయసు నలభై ఏళ్లు. మొదటి భార్య పోతే తిరిగి వివాహం చేసుకోక తన సర్వ శక్తులనూ రాజ్యపాలనకే ధారపోస్తూ వచ్చాడు. ఆయన గొప్ప మేధావి. రాజద్రోహులుగా కారాగారం అనుభవిస్తూన్న వారిని గురించి సాధ్యమైనన్ని రహస్యాలు సంపాదించటానికి ఆయన సమస్తమైన ఏర్పాట్లూ చేసి ఉంచాడు. కారాగృహంలో ఉన్న ఈ రాజద్రోహులు ఎలా ప్రవర్తించుతున్నదీ భటులద్వారా ఆయన తెలుసుకుంటూ ఉండేవాడు.

ఒక్క గుణభూషణుడి ప్రవర్తనే మంత్రిని ఆశ్చర్యపరిచింది. అతను ఖైదులో



ఉన్నప్పటికీ అతని రాజసం కొంచమైనా తగ్గలేదు. అతను ఎవరితోనూ మాట్లాడడు, అనవసరమైన ప్రశ్నలకు జవాబులు చెప్పడు. కారాగృహంలో ఉండే కావలివారితో తానొక అధికారి అయినట్టే ప్రవర్తిస్తాడు. అతను బోనులో చిక్కిన సింహంలాగా ఉండి ఎల్లప్పుడూ ఏదో విచారంతో ఉన్నట్టుగా కనబడేవాడు.

అతని విచారం కేవలం ఒక్క మనిషిని గురించే. ఆ మనిషి అతని ప్రియురాలు, మాధవి. అతనిదీ ఆమెదీ ఒకే ఊరు. కేవలం ఆమె కారణంగానే అతను మగధ దేశం వదిలిపెట్టి కాశీరాజ్యంలో బతుకు తెరువు చూసుకోవలిసి వచ్చింది. అది ఎలా జరిగిందంటే—

గుణభూషణుడి తండ్రిలాగే మాధవి తండ్రికూడా గొప్ప ధనికుడు. ఆయనకు ఆ పిల్ల తప్ప వేరే సంతానం లేదు. ఆయన ఆకస్మికంగా చనిపోయేసరికి దాయాదులు ఆయన ఆస్తి యావత్తూ కాజేసి మాధవికి చిల్లిదమ్మిడీ లేకుండా చేసేశారు. కోటీశ్వరుడి కుమార్తె అయిఉండికూడా మాధవి తిండికీ, బట్టకూ తన శత్రువులపై ఆధారపడి, నౌకరులాగా బతకవలసి వచ్చింది. గుణభూషణుడు మాధవిని చిన్నతనం నుంచీ ఎరుగును. అతను కాస్త పెద్దవాడయాక చిన్నతనపు స్నేహం ప్రేమగా మారింది. అతను ఆమెకు చాతనయినంత సహాయం చేసి ఎప్పటికైనా ఆమెనే పెళ్ళాడ నిశ్చయించాడు. కాని అతని తండ్రికి ఇదేమీ నచ్చలేదు. మాధవితో ఎలాటి సంబంధమూ పెట్టుకోవద్దనీ, ఆమెతో మాట్లాడినట్టు తెలిసినా ఇంటినుంచి వెళ్లగొట్టుతాననీ ఆయన కొడుకుతో చెప్పాడు. గుణభూషణుడు తండ్రిమాట లక్ష్యపెట్టక, ఆయనకు తెలియకుండా మాధవికి అప్పుడప్పుడూ డబ్బు కూడా ఇస్తూ వచ్చాడు. చిట్టచివరకు అతనిని తండ్రి ఇంటి నుంచి వెళ్లగొట్టాడు.

తన స్థితి గ్రహించుకుని గుణభూషణుడు కాశీనగరం వచ్చి రాజుగారివద్ద ఉద్యోగం సంపాదించుకున్నాడు. ఈ ఉద్యోగంలో కాస్త పరువుప్రతిష్టలు సంపాదించుకున్నాక అతను మాధవిని తెచ్చుకుని, పెళ్లి చేసుకుందామనుకున్నాడు. కాని ఇంతలోనే ఈ రాజద్రోహం వచ్చి పడి అతని కలలన్నీ విచ్చిపోయాయి.

అక్కడ మగధదేశంలో మాధవికూడా అన్ని ఆశలూ గుణభూషణుడిపైనే పెట్టుకుని ఉన్నది. అతనికి కాశీరాజువద్ద కొలువు కుదిరిందని తెలిసి ఆమె చాలా సంతోషించింది. ఎప్పుడైనా తన దేశంవారు కాశీకి పోతుంటే వారిద్వారా ఆమె గుణభూషణుడికి తన యోగక్షేమాలు అందజేసేది. అలాగే గుణభూషణుడుకూడా అప్పుడప్పుడూ ఆమెకు తన యోగక్షేమాలు తెలియబరుస్తూ ఉన్నదానిలో కొంతడబ్బుకూడా పంపేవాడు.

అంతలోనే మాధవికి పిడుగు పడ్డట్టుగా కాశీలో రాజద్రోహులను ఉరి తీసిన వార్త తెలిసింది. వారిలో చాలామంది మగధదేశం వారని తెలిసినాక ఆమె భయంతో కంపించి పోయింది. రాజద్రోహులలో గుణభూషణుడు ఉన్నదీ లేనిదీ తెలియలేదు. ఆమెకు రెక్కలు కట్టుకుని కాశీలో వాలాలని ఉన్నది; కాని అది సాధ్యమయే పనికాదు.



కొద్దికాలానికి ఆమెకు కాశీ వెళ్ళే అవకాశం లభించింది. తీర్థయాత్రలు చెయ్యటానికి అమెకు తెలిసినవారు కొందరు ప్రయాణమయారు. వారితోబాటు మాధవి కూడా బయలుదేరింది.

యాత్రికులు అనేక పుణ్యస్థలాలు చూసుకుని కొన్ని నెలలకు కాశీ చేరుకున్నారు. కాశీ చేరుతూనే మాధవి గుణభూషణుడి విషయమై ఆరా తీసింది. ఉరి తీసిన రాజద్రోహులలో గుణభూషణుడు లేడనీ, అతను ఖైదులో మగ్గుతున్నాడనీ ఆమెకు తెలిసింది.

"గుణభూషణుడు ఎన్నటికీ రాజద్రోహం చెయ్యడు, అతనిని అకారణంగా ఖైదులో ఉంచారు. అందులోనుంచి అతను బయట పడటం ఎలా?" అని ఆమె కొందరు పెద్దలను అడిగింది.

"మంత్రి కైలాసనాధుడు తలుచుకుంటే అతనికి క్షణంలో చెర తప్పుతుంది. గుణభూషణుడి ఆప్తులెవరైనా వెళ్ళి ఆయనతో మాట్లాడటం మంచిది," అని పెద్దలు మాధవికి సలహా ఇచ్చారు.

గుణవర్ధనుణ్ణి ఆప్తులైనవారు ఏనాడో బహిష్కరించారు. తను మంత్రిగారివద్దకు వెళ్ళి, గుణవర్ధనుడి చెల్లెలినని చెప్పుకుని, అతను చెరనుంచి బయటపడేయత్నం చేద్దామని మాధవి నిశ్చయించుకున్నది.





ఆమెకు మంత్రిగారి దర్శనం సులువుగానే లభించింది. మాధవిని చూడగానే మంత్రి కైలాసనాధుడు ముగ్ధుడయాడు. ఆమె అందంగా ఉండటమే గాక అమిత అమాయకురాలుగానూ, ఏ కోశానా కపటమన్నది లేనిదిగానూ కనబడింది. ఆమెలో వినయమూ, నమ్రతా ఉట్టిపడుతున్నాయి. ఆమె హృదయం అతికోమలమైనదని ఆయనకు త్వరలోనే తెలిసివచ్చింది. గుణభూషణుడి ప్రసంగం రాగానే ఆమె కంట జలజల కన్నీరు కారింది.

"నాకు అతనూ, అతనికి నేనూ తప్ప మాకింకెవరూ లేరు. అతను ప్రాణం పోయినా రాజద్రోహం చేసేమనిషి కాడు, నామాట నమ్మండి! నాపై కరుణించి అతన్ని విడిచిపెట్టండి!" అని ఆమె మంత్రిని వేడుకున్నది.

"నీ అన్న రాజద్రోహం చేసినట్టు నిజానికి రుజువు కాలేదు. కాని అతని సంగతి ఎవరికీ తెలిసినట్టు కనబడలేదు. అతనిని నీవెంట మీ దేశానికి తీసుకుపోయే పక్షంలో విడిచిపెట్టటానికి నాకేమీ అభ్యంతరంలేదు. నిన్ను చూస్తే గొప్పఇంట పుట్టి సంస్కారంతో పెరిగినదానిలాగా కనిపిస్తున్నావు. అతను కూడా నీవంటివాడే అయి ఉండవచ్చు," అన్నాడు మంత్రి.

"మాఅన్న నిజంగా చాలా మంచివాడు. అతనిమీదనే అన్ని ఆశలూ పెట్టుకుని బతుకుతున్నాను," అన్నది మాధవి.

"అలా ఎందుకు జరిగిందీ? నీకింకా వివాహం కాలేదేం?" అని మంత్రిగారు ఆమెను అడిగాడు.

మాధవి సిగ్గుతో తల వంచుకుని, "అతను ఖైదులో ఉండగా నా వివాహం ఎలా అవుతుంది?" అన్నది.

మంత్రిగారు మాధవిని మర్నాడు కనపడమని పంపేసి, కారాగృహంనుంచి గుణభూషణుణ్ణి తీసుకురమ్మని భటులను

పంపాడు. మాధవి ఆయనను బలంగా ఆకర్షించింది. అలాటి భార్య ఉంటే తన జీవితానికి లోటే ఉండదనిపించింది. ఆయన ఎందరో స్త్రీలను రోజూ చూస్తున్నప్పటికీ ఆయనలో మళ్లీ పెళ్లాడాలన్న కోరిక ఈ విధంగా ఎన్నడూ తలఎత్తలేదు.

భటులు గుణభూషణుణ్ణి వెంటపెట్టుకు వచ్చారు. మంత్రిగారు అతన్ని కూచోమని, "మీ చెల్లెలు మాధవి వచ్చి నిన్ను విడిపించమని విజ్ఞాపన చేసుకున్నది. ఆమె చాలా బుద్ధిమంతురాలుగా కనిపించింది. ఆమె కోసం నీవు చాలా కష్టాలు పడ్డావట. అలాటి చెల్లెలికోసం నేనైనా కష్టాలు పడేఉందును. నీవు మీ దేశానికి తిరిగి వెళ్లేపక్షంలో నిన్ను చెర విడిపించదలిచాను!" అన్నాడు.

"తమ దయకు చాలా కృతజ్ఞుణ్ణి! కాని నేనుమాత్రం మాదేశానికి తిరిగి పోలేను. ఇక్కడ బందిఖానాలో ఉన్నదానికీ, అక్కడ స్వేచ్ఛగా ఉన్నదానికీ తేడా ఏమీలేదు. అక్కడ నాకు మాధవికన్న ఏమీ లేదు. ఆమెను ఇక్కడికి తెప్పించుకుందామనుకుంటూండగా నాపై రాజద్రోహ నేరం వచ్చి పడింది!" అన్నాడు గుణభూషణుడు.

మంత్రి క్షణం ఆలోచించి, "నీకు స్వదేశాభిమానం లేని పక్షంలో నీవల్ల కాశీ



రాజ్యానికి ద్రోహం జరగదు. అందుచేత రాజుగారిని ఒప్పించి నిన్ను తిరిగి కొలువులో పెట్టిస్తాను!" అన్నాడు.

"తమ మేలు ఎన్నడూ మరవను!" అన్నాడు గుణభూషణుడు.

"ఒక్క క్షణం కూచో, నేను నిన్ను ఒక కోరిక కోరదలిచాను," అన్నాడు మంత్రి. గుణభూషణుడు నిర్ఘాంతపోయాడు.

"నన్ను తిరిగి పెళ్లాడమని ఎంతోమంది ఎన్నో వేలసార్లు అడిగారు. కొందరు నాకు తమ కుమార్తెలనూ, చెల్లెళ్లనూ ఇస్తామన్నారు కూడా. నాకే వివాహేచ్ఛ కలగలేదు. ఇవాళ మీ చెల్లెలిని చూశాక అలాటి

భార్య ఉంటే నా జీవితం వికసిస్తుం దని పించింది. ఆమెకు నన్ను శిఫార్సు చెయ్య గలవా? ఆమెను నిర్బంధించవద్దు సుమా!" అన్నాడు మంత్రి. గుణభూషణుడి ఆశ్చర్యం పదింతలయింది.

"మీ రడిగినదానికి సమాధానం చెప్పే ముందు ఒక్క విషయం నన్ను బయట పెట్టనివ్వండి. నన్ను తమరు తిరిగి కొలువులో పెట్టటానికి కారణం మాధవే అయిన పక్షంలో ఈ సంగతి; మీకు తెలియటం అవసరం. నేను బొత్తిగా నిర్దోషిని కాను. రాజద్రోహపు కుట్రతో నాకు సంబంధం లేకపోయినప్పటికీ, కుట్ర జరుగుతున్న సంగతి నేనెరుగుదును. కుట్రదారులలో ఒకడు మాదేశంలో చాలా పలుకుబడి గలవాడు. మాధవి నిజంగా నాచెల్లెలు కాదు; ఆమెను నేను వివాహమాడుదామనుకుంటున్నాను. ఆమె తండ్రి కోటీశ్వరుడు. ఆయన ఆస్తిని దాయాదులు కాజేసి ఆమెకు చిల్లిగవ్వ దక్కకుండా చేశారు. ఈ కుట్రదారు మాధవి ఆస్తి మాధవికి దక్కేలాగ చేస్తానని నాకు మాట ఇచ్చాడు. నేను రాజుగారి ఉప్పు తింటున్న వాడినై ఉండికూడా, మాధవికి సహాయం చేస్తానన్నాడన్న విశ్వాసంతో అతను చేసే కుట్ర గురించి బయటపెట్టలేదు. అందుచేత



నేనుకూడా రాజద్రోహినే! ఈ విషయం మీకు దాచకుండా చెప్పేశాను గనక, మీరడిగినదానికి నా సమాధానం వినండి. మీరు మాధవిని పెళ్లాడ గోరుతున్నారనీ, మీకన్న యోగ్యుడైన భర్త ఆమెకు దొరకడనీ ఆమెతో చెబుతాను. అదే నా నమ్మకం కూడా. తరవాత ఆమె ఇష్టమైతే మిమ్మల్ని పెళ్లాడుతుంది. లేకపోతే మానుతుంది. ఆమెను బలాత్కరించి మిమ్మల్ని పెళ్లాడేట్టు చేసే అధికారం నాకు లేనే లేదు!" అన్నాడు గుణభూషణుడు.

"ఏమిటంటున్నావు? నీవు నన్ను శిఫార్సు చెయ్యవద్దు. ఆమెకోసమేగదా నీవు రాజద్రోహిగా శిక్ష అనుభవించే స్థితికి వచ్చావు? ఆమె నిన్ను పెళ్ళాడటమే ధర్మం!" అంటూ మంత్రి అప్పటికప్పుడే అతని విడుదలకు ఉత్తరువిచ్చాడు.

తరవాత ఆయన గుణభూషణుడికి రాజుగారి కొలువులో పెద్ద ఉద్యోగం ఇప్పించాడు. అతనికీ మాధవికీ వైభవంగా పెళ్లి జరిగింది.

ఈ కథ చెప్పి బేతాళుడు, "రాజా, గుణభూషణుడు తాను ఖైదునించి బయట పడబోతూకూడా, మంత్రిగారు తాను నిరపరాధి అనుకుని విడిచిపుచ్చటం ఇష్టంలేక నిజం చెప్పి తన ప్రాణాన్నీ, మాధవినీకూడా పోగొట్టుకునే పరిస్థితి కల్పించుకున్నాడు.





రాజద్రోహి అని తెలిశాక అతనిని సులువుగా ఊరి తీయించి మాధవిని పెళ్ళాడి సుఖంగా ఉండదగిన స్థితిలోకూడా కైలాసనాధుడు మాధవినీ తన సుఖాన్నీ త్యాగంచేశాడు. ఈ ఇద్దరిలో ఎవరి త్యాగం గొప్పది? సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది!" అన్నాడు.

"నిస్సందేహంగా గుణభూషణుడి త్యాగం గొప్పది. అతనికి మాధవిపై గల ప్రేమ అత్యుత్తమమైనది. మంత్రిగారికి కూడా ఆమెపై అలాటి ప్రేమ ఉన్నదని గ్రహించి అతను నిజం చెప్పేశాడు. లేని పక్షంలో అతను మాధవి తన చెల్లెలు కాదని గాని, తాను కుట్ర సంగతి ఎరుగుదుననిగాని, మంత్రితో అనవలసిన పనే లేదు. నిష్కల్మషమైన ప్రేమ గలవాడు ఆ ప్రేమ ఫలితంగా మోసపోరాదు. మాధవిపై గల ప్రేమకొద్దీ తాను నిర్దోషి అని మంత్రిగారు భావించటం గుణభూషణుడికి ఎంత మాత్రమూ ఇష్టంలేదు. అందుచేత అతను తన ప్రాణాన్నీ, మాధవినీ త్యాగం చెయ్యటానికి సిద్ధపడ్డాడు. నిజానికి మంత్రిగారు చేసిన త్యాగం అటే లేదు. ఎందుచేతనంటే, ఆయన మాధవిని ప్రేమించినప్పటికీ, ఆమెకు ప్రపంచంలో గుణభూషణుడు తప్ప ఎవరూ లేరనీ, గుణభూషణుడు ఆమె అన్న గనక, తన ప్రేమకు పోటీ ఉండదనీ నమ్మాడు. గుణభూషణుడు ఆమె ప్రియుడని తెలిశాక ఆ నమ్మకం కాస్తా పోయింది. గుణభూషణుణ్ణి రాజద్రోహిగా ఊరి తీయించి తాను మాధవిని పెళ్ళాడినా ఆమెద్వారా తాను పొందే సుఖం ఏమీ ఉండదు. అందుచేత నా దృష్టిలో గుణభూషణుడు తల పెట్టిన త్యాగం లోకోత్తరమైనది," అని విక్రమార్కుడు జవాబు చెప్పాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# ప్రకృతి వింతలు

## 3

ఇక్కడ నదినిండా రాళ్లగుట్టలున్నాయి. ప్రవాహం అతి విసురుగా ఉన్నది. మేమూ రాళ్లగుట్టల మధ్యకు ప్రవేశించాం. ప్రవాహం మా తెప్పను అతివేగంతో ఈ పక్కకూ, ఆ పక్కకూ ఈడ్చేస్తున్నది.

"ఇప్పుడు తెడ్డు వెయ్యవద్దు, న్యోకు చాప్!" అని కుర్రవాడు కేకవేశాడు.

నేను తెడ్డు వెయ్యటం మానేసి మా తెప్ప ఏ క్షణాన ఏ రాతికి తగిలి ముక్కలయి పోతుందోనని భయపడసాగాను. కాని కుర్ర వాడు ఎంతో చాతుర్యంతో తెడ్డు ఉపయో గిస్తూ మా తెప్పను దుడుకుప్రవాహంనుంచి తప్పించి సుడులు ఆటు లేని పాయలోకి చేర్చాడు. అయినా ప్రవాహవేగంమటుకు అంతకంతకూ హెచ్చుతున్నది. ఒక సమ యంలో మా తెప్ప సూటిగా ఒక రాతికి ఢీ కొంటుం దనిపించింది.

"ఇప్పుడు తెడ్డు వెయ్యాలి, న్యోకుచాప్! బలమంతా పెట్టాలి!" అని కుర్రవాడు గట్టిగా అరిచాడు. నది చేసే భీకరమైన రొదలో నాకు వాడి మాటలు వినపడటం కష్టమయింది.

నేను అతి వేగంగా తెడ్డు వేయసాగాను. కుమేవావా బలమూ, వేగమూ చూస్తే నాకు ముచ్చట వేసింది. రాయి ఇంకా రెండు గజాలదూరంలో ఉండి, మరుక్షణంలో మేము దాన్ని ఢీకొంటామనగా, వాడు బలంగా తెడ్డును నీటితో తోశాడు. తెప్ప ఎడమ పక్కకు తిరిగి, రాతిని రెండడుగుల ఎడంలో తప్పుకుని ముందుకు పోయింది. కుర్రవాడు చురుకుదనమూ, తెలివీ చూపక పోతే మేమూ రాతికి బలిఅయి ఉండేవాళ్లమే.

మరి కాస్సేపు ఉపాయంగా తెప్పను నడుపుకుంటూ ఝరిని దాటి ప్రశాంతమైన

తిబోర్ సెకెల్య



ప్రవాహంలో వచ్చిపడ్డాం. ప్రయాస మూలాన ఇద్దరికీ అలుపు వచ్చింది. కుమేవావా తెప్ప ముందుభాగంలో పడుకున్నాడు. నేను వాడికి ఎదురుగా పడుకున్నాను. వాడి ముఖాన చిరునవ్వు తాండవిస్తున్నది. ఆకాశాన తేలే దూదిపింజెలలాటి మబ్బులకేసి చూస్తూ వాడు విశ్రాంతి తీసుకున్నాడు. తెప్ప ఒడుదుడుకులు లేకుండా ప్రవాహం వెంబడి ముందుకు పోతున్నది.

"నువు ప్రజ్ఞ గలవాడివి గనక ఇవాళ మనం బతికి బయటపడ్డాం," అన్నాను.

"నీటినీ, అడవిజంతువులనూ మనం వశపరుచుకోకపోతే అవే మనని వశపరుచుకుంటాయని మలోవా తాత అంటాడు. ఇంతకంటె సులువైన మార్గం ఉన్నది కాని ఇటు రావటంలోనే మజా ఉన్నది. ఇక్కడ నీరు చాలా లోతు. చేపలు పడదాం," అన్నాడు కుర్రవాడు.

వాడు చెప్పినప్రకారం నేను తెప్ప వెనక భాగంలో కూచుని, వాడి సంజ్ఞలను అనుసరించి కుడిచేత్తోనూ, ఎడమచేత్తోనూ మెల్లిగా తెడ్డువేయసాగాను. వాడు విల్లూ, బాణాలూ చేతబట్టి పడవ ముందుభాగంలో నిలబడ్డాడు. వాడి శరీరం పోతపోసిన కంచు విగ్రహంలాగా కనిపిస్తున్నది. వాడి వెనక ఉదయపు నీలాకాశం ఉన్నది. వాడి నల్లని జుట్టు భుజాలదాకా వేళ్ళాడుతున్నది. వాడి ముక్కుకు అడ్డంగా ఒక కాడ ఉన్నది. వాడి చెక్కిళ్ళమీద రెండు వలయాలు పచ్చ పొడిచి ఉన్నాయి. కరజా జాతివారి కందరికీ ఇది గుర్తు. వాడి తల చుట్టూ ఒక సన్నని ఆకుపచ్చని పట్టీ ఉన్నది. వెనక భాగాన ఈ పట్టీలోకి ఒక పెద్ద రాబందు ఈక దూర్చి ఉన్నది. వాడు ధరించిన దుస్తులు ఒక మొలతాడూ, దానికి పెట్టిన పుట్టగోచీమాత్రమే.

వాడు అలాగే నిలబడి నీటికేసి తీక్షణంగా చూస్తున్నాడు.

ఉన్నట్టుండి వాడు ఒక బాణాన్ని వదిలాడు. అది నీటిని చొచ్చుకుపోయింది. అది మళ్లీ ఎప్పుడు తేలుతుందా అని మేము ఆత్రంగా చూశాం. బాణం ఈకలు నీటిపైన కనిపించగానే కుర్రవాడు తన విల్లుతో దానిని అందుకుని దగ్గిరికి లాక్కున్నాడు. బాణం ములికికి ఒక రెండు అడుగుల చేప తగులుకుని తన్నుకుంటున్నది. వాడా చేపను బాణంనుంచి ఊడదీసి తెప్ప అడుగున పెట్టేశాడు.

మేము పని సాగించాం. మరొక అరగంట లోపల వాడు ఇంకా ఐదు చేపలను ఇలాగే పట్టాడు. వాటిలో రెండు చేపలు మొదటి చేపకన్నకూడా పెద్దవి. కుర్రవాడు విల్లంబులు కింద పెట్టేసి పంట్రకోల తీసుకున్నాడు, దాని కర్రనూ, ఇనప ములికినీ, తెప్ప ముందుభాగానికి కట్టి ఉన్న కోల తాడునూ శ్రద్ధగా పరిశీలించాడు. వాడికేదో పెద్ద చేప కనబడిందని నేను గ్రహించాను. వాడు వంగి నిలబడి నీటిలోపలికి చూశాడు. వాడు కదలకుండా చాలాసేపు అలాగే నిలబడి చూసి, చివరకు తెప్పను కుడిపక్కకు నడపమని నాకు సంజ్ఞచేశాడు. అకస్మాత్తుగా వాడు తన కుడిచేతిలో ఉన్న పంట్రకోలను ఎత్తి బలంగా నీటిలోకి విసిరాడు.



పంట్రకోల గురి తప్పినదీ, తగిలినదీ కొద్ది క్షణాలపాటు మాకు తెలియలేదు, ఆ క్షణాలు మాకొక యుగంలాగా తోచాయి. చివరకు పంట్రకోల మొన నీటిపైకి వచ్చి దూరంగా వెళ్లిపోతూ కనబడింది. తాడంతా నీటిలోకి వెళ్ళిపోయాక అది బిగుసుకుని మా తెప్పను కూడా లాగసాగింది. నీటి అడుగున ఉన్న ప్రాణి ఏదో మా తెప్పను లాక్కుపోతున్నది. అది చాలా పెద్ద చేప అయిఉండాలి. దెబ్బతిన్న ఆవేశంలో అది మా తెప్పను ఈ పక్కకూ ఆ పక్కకూ గుంజుకుపోతున్నది. కుమేవావా తెప్ప ముందు భాగంలో పడుకున్నాడు.

పదినిమిషాలపాటు వెర్రివేగంతో పోయిన తరవాత దెబ్బతిన్న చేప వడి క్రమంగా తగ్గి చివరకు నిలిచిపోయింది. ఇప్పుడు మేము తాడును లాగసాగాం. తాడు అయిపోగానే పంట్రకోలా, దానికి గుచ్చుకుని ఉన్న పెద్ద "పిరేకురు" చేపా చేతికి అందాయి. ఈ చేప నిడివి రెండుగజాలున్నది. ఎమెజాన్ నదిలో దొరికే చేపలన్నిటిలోకీ ఇది చాలా రుచి అయినది.

ఈ చేపను తెప్పలో చేర్చినాక మేము శ్రమ తీర్చుకుంటూ కూర్చున్నప్పుడు ఆ కుర్రవాడి సామర్థ్యాన్ని మెచ్చుకున్నాను. వాడు నా మెప్పును లక్ష్యపెట్టక, "అన్ని జంతువులకూ ఆహారం సంపాదించుకునే విద్య రావాలి, మనిషికికూడానూ," అన్నాడు.

"కాని నువు చాలా చిన్నవాడివే!" అన్నాను.

"నా బుగ్గలమీద పచ్చ పొడిచిన ఈ వలయాలు చూడరాదా? నేను పెద్దవాణ్ణనీ ప్రయోకత్వం గలవాణ్ణనీ, వీటికి అర్థం," అన్నాడు వాడు.

"అలాగా? అదేమిటో కాస్త వివరంగా చెప్పు, వావా!" అన్నాను.

"ఇప్పుడు వ్యవధి లేదు. మనం మాట్లాడితే చేపలు పారిపోతాయి. అక్కడ నీ స్నేహితులు తిండికి మాడుతున్నారు," అన్నాడు వాడు.

"అయినా ఆ పచ్చపొడుపు సంగతి కాస్త చెప్పు. నాకు నిజంగా తెలుసుకోవాలని ఉంది," అన్నాను.

"నిలకడ ఉన్న మనిషికి నిజం తెలుస్తుందని మలోవాతాత అంటాడు," అన్నాడు వాడు.

నేను మరి మాట్లాడక, నిలకడ ఉన్న మనిషిలాగా కనిపించటానికి ప్రయత్నించాను, కాని ఆ విషయం తెలుసుకోవాలని లోపల దహించుకుపోతూనే ఉన్నాను.

—(ఇంకా వుంది)



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1958 నవంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాక్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ. మద్రాసు-26.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మాకు తోడు...

రెండవ ఫోటో : మరి ఇద్దరు

పంపినవారు : దామరాజు గోపాలక్రిష్ణమూర్తి,

C/o ఎం. తిరపతిరావుగారు, 6585 శివాజీనగర్, సికింద్రాబాదు.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు 'టైగర్' ను వెంటబెట్టుకుని జామతోటలోకి వెళ్ళి, చెట్లకువున్న కాయల్ని ఒకటొకటే కోసి, వెంట తీసుకుపోయిన బుట్టలో వేయసాగారు. కొంతసేపటికి మరికొన్ని కాయలతో తిరిగి వచ్చేసరికి, బుట్ట కనబడలేదు. ఆ ప్రాంతాల వెతగ్గా వెతగ్గా ఏదో జంతువు వచ్చిపోయిన కాలిగుర్తులు మాత్రం కనిపించినై. 'టైగర్' పసిపట్టి ఆ గుర్తుల వెంటే పోసాగింది. బహుశా యిదేదో చిరుతపులో, ఎలుగుబంటో అయివుంటుందని భయపడుతూ, దాసూ వాసూలు దాని వెనకనే నడిచారు. తీరా వాళ్ళు ఒక కట్టమీదినుంచి కిందికి చూసేసరికి, బుట్టలోని జామకాయలు తింటూన్న గాడిద ఒకటి పెద్దగా ఓండ్రు పెట్టింది.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor: SRI 'CHAKRAPANI'

పుస్తకాల్లో ఆసక్తి కొందరికి...






కాని, ప్రతీవారికి ఆసక్తి



Parry's ప్యారీస్

మిఠాయీల్లోనే

ఎందుకంటే, అవి అంత రుచిగలవి, అంత పరిశుభ్రమైనవి, అంత ఆరోగ్యమైనవి

తయారుచేయువారు : ప్యారీస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్, మదరాసు.

PRS 319

త్వరలో
విడుదల!



ఆర్. ఆర్. పిక్చర్సు వారి

# కార్తవరాయుని
కథ..

డైరెక్షన్... రామన్న

కథ, మాటలు..... ముద్దిపట్ల సూరి..
పాటలు........ దేవులపల్లి కృష్ణశాస్త్రి
సంగీతం... జి. రామనాథన్. అశ్వత్థామ
సంయుక్త దర్శకుడు... ఐ. యస్. మూర్తి






Photo by P. Krishnakumar



బహుమతి
పొందిన వ్యాఖ్య

మరి ఇద్దరు!

పంపినవారు:
డి. జి. క్రిష్ణమూర్తి - సికింద్రాబాదు

